శ్రీకరమ్ములు - సద్భక్తసేవితములు
సచ్చిదానందయుతములై - శాంతినొసఁగు
వేంకటేశ్వర పాదారవిందములకు
మ్రొక్కుచు - నిరంతరమ్ము నమస్కరింతు.

అవధానుల పురుషోత్తమశర్మ బి.ఓ.ఎల్

# తొలిపలుకు

## సరసహృదయులు, రసజ్ఞులగు, పాఠకమహాశయులకు, భక్తవర్యులకొక విన్నపము

ఈ నాపురుషోత్తమరామాయణము, 1939 మార్చి నెలలో మొదలిడి. 1971 ఆగష్టు 31వ తేదీనాటికి, భగవత్కృపవలన పూర్తి చేసితిని. నేనుమిగులనకించనుఁడగుటచే ముద్రింపలేనైతిని. ఈ పురుషోత్తమరామాయణము ఖమ్మంజిల్లా మధిర గ్రామమున సుప్రతిష్ఠితుఁడైయున్న గంగాపార్వతీసహితుఁడగు, మృత్యుంజయస్వామివారి కంకితమీయఁబడినది.

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారి ధనసహాయమున 1980వ సం॥ మే నెలలో నాచేరచింపఁబడిన "భక్తదీపిక" అను పద్యకావ్యము ముద్రింపబడి భక్తవర్యుల మన్ననపొందినది. ప్రస్తుతము శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారి ద్రవ్యసహాయమున, నాపురుషోత్తమ రామాయణాంతర్గతమగు, శ్రీమత్సుందరకాండ ముద్రింపబడి భక్తజనుల హస్తమలంకరింపనున్నది. నా కావ్యముల ముద్రింపించుటకు, ధనసహాయ మొనరించుచున్న శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానాధికారులకు, మరియు దేవస్థాన కార్యనిర్వహణాధికారియగు. మ॥ రా॥ శ్రీ॥ పి, వి. ఆర్. కె. ప్రసాద్ ఐ. ఎ. యస్ గారికి, నా హృదయపూర్వకవందనములర్పించుచూ, నా రామాయణమును, సంపూర్తిగా ముద్రించుటకు తగిన ద్రవ్యసాయ మొనరింపగలందులకు, నమస్కారములర్పించుచుంటిని.

నా దరిద్రావస్థ గమనించి శ్రీ తిరుమలతిరుపతి దేవస్థానము వారొసంగుద్రవ్యము చాలా తక్కువయైనను ప్రింటింగ్ ఛార్జీలు కాగితపుఖర్చు పెరిగినను, తనకు గలుగు నష్టమును లెక్కింపక నాయందాదరముతో నా యీపొత్తముల వ్యయమునకోర్చి ముద్రించు వైశ్యకులభూషణులు; నిరాడంబరులు, నిగర్వ చూడామణులు; వితరణశీలియగు. సత్తుపల్లి వెంకటేశ్వర ప్రింటింగ్ ప్రెస్ ప్రొప్రయిటరుగారునగు మ రా॥శ్రీ॥ కొత్తూరి ప్రభాకర రావుగారికిని, వారి కుటుంబ సభ్యులకు; కలియుగ ప్రత్యక్ష దైవము, నిత్యకల్యాణాద్భుతగాత్రుడగు. శ్రీ వేంకటేశ్వరస్వామి దీర్ఘాయురారోగ్యసౌభాగ్య సంతతి నొసంగి రక్షింపకై మ్రొడ్డు ఘటించుచుంటిని ఈనా కావ్యము సర్వాంగ సుందరముగా తీర్చిదిద్దిన సత్తుపల్లి వెంకటేశ్వర ప్రింటింగ్ ప్రెస్ వర్కర్లకు, శ్రీ శ్రీనివాసమూర్తియైన, వేంకటరమణుఁడాయురారోగ్యైశ్వర్యములనిచ్చి, నిరంతరము రక్షించుగాక. తప్పులున్న క్షమింప సహృదయులకు నమస్సుమాంజలిఘటించెద.

సత్తుపల్లి
అగష్టు 1981

బుధజనవిధేయుఁడు
అవధానుల పురుషోత్తమశర్మ.



కవి. అవధానుల పురుషోత్తమశర్మ * కవిపత్ని. లక్ష్మీనరసమ్మ

జననము:- 4-9-1932 జననము:-15-9-1940

ఓం

# పురుషోత్తమ రామాయణము

## సుందరకాండ

(పద్యకావ్యము)

శ్రీ మత్సుందరవిగ్రహా
కామితఫలదాయకా సుఖంకరశౌర్యో
ద్దామా భవహర పరమా
త్మా మృడ మృత్యుంజయాఖ్యమధిరనివాసా.

గీ॥ అవధరింపుము ధర్మజ్ఞుడైతనర్చు
జాంబవంతుడు పురికొల్ప శాత్రవులను
రూపుమాపగజాలు మారుతతనయుడు
తనువు పులకింప సింహనాదమునొనర్చె.

సీ॥ తత్సమయంబునందగ రావణానీత యైన సీతను జూడనభిలషించి
శత్రుకర్శనుడగు స్వామికి చారణుల్
చరియించునానభస్థానమందు.
ధీమంతుడై జనందివిరి శ్రీరాముని ముద్రికఁగైకొనిముదముతోడ
కడఁగి సముద్రలంఘన మొనరింపగా
సముదగ్రమైన శీర్షంబుమెడయు.

గీ॥ కలిగియొప్పెగవాంపతికరణి గొప్ప
బలము ధైర్యము విక్రమ ప్రభలఁజెలఁగి
వక్షమున వృక్షముల ద్రోసివాసి మీర
నెసఁగుచుమృగములజంపు మృగేంద్రుభాతి.

చం॥ తన భుజవిక్రమంబును నుదాత్త జవంబును సమ్మతింపమనం
బునసకలామరుల్ వొగడ పుణ్యుఁడు నా హనుమంతుడంత, శ
య్యానశతయోజనాన్వితమునై దగునంబుధిదాటి లంకకుం
జనగణుతింపగా బెరిగె శైలనిభోన్నత గాత్రుడోయి నర.

కం॥ శ్రీమహితుడైన మారుతి
భీమాననుడగుచు పెద్దపెట్టున నభపుల్
వ్యోమపథమావరింపగ
రామునకుంజయముపలికి ప్రాఙ్ముండగుటన్.

ఉ॥ అంతటఁ బ్రాగ్దిశాభిముఖుడై కపిసింహుడు భక్తితో వివ
స్వంతునకున్ గిరీశునకు వారిజగర్భునకున్ పులోమజా
కాంతునకున్ ముకుందునకు గాలికిఁజేతులనెత్తిమ్రొక్కి వి
క్రాంతి మహేంద్రపర్వతము గర్జనసేయుచు నెక్కెయుత్సునన్.

గీ॥ వినుఁడు కపులారనిజమేను విన్నవింతు
శీఘ్రమే లంకకేగి యాసీతనందుఁ
గాంచివచ్చెద లేనిచో కడురయమున
స్వర్గమునకేగి దర్శింతు జనకసుతను.

చం॥ త్రిదివమునందు మైథిలిని ప్రీతికనుంగొననేని క్రమ్మఱన్
గొడికొని లంకకేగి సురకోటినుతింప నిశాచరేంద్రుదు
ర్మదుని మదీయ వాలమునమచ్చరికించుచుఁబట్టి కొట్టిఁ దె
చ్చెద నినపుత్రుడుబ్బ రఘుసింహుని చెంతకు నెందఱొడ్డినన్.

కం॥ రాముఁడు విడిచినబాణము యేమెయివేగమునఁబోవు నంచగనస్లు
[illegible] నేనగద రామునిబంటునకు దుష్కరంబిలగలదే.

గీ॥ లావు మెఱయగ గొనితెత్తు లంక పెటికి
వాయుపుత్రుడు విక్రమవర్యుడనుచు
యక్షగంధర్వసిద్ధ సాధ్యాదిసురలు
బిట్టువినుతింప నసురుల పీచమడచి.

కం॥ అని బలికి యతిరయంబున
హనుమంతుడు నబ్ధిదాటి యభ్రపథమునన్
జననెగసియప్మహేంద్రము
దనయంఘ్రిని నదిమె నదియు ధరణింగ్రుంగన్.

చం॥ అచలమునైరహించుగిరి యా హనుమంతుని కాలిత్రొక్కిడిన్
ప్రచలితమై ప్రహర్షమున పాదపముల్ సుమరాజిరాల్పనూ
గుచు కడువిస్మయంబొదవ కూరిమి మారుతిమీద పూలరా
ల్చుచు కడుభక్తి ధీమతిని సొంపలరన్ భజియింప నత్తరిన్

మ॥ గిరిమర్దించుచు వాయునందనుడు, రక్తిన్ సింహనాదంబు జె
చ్చెరసేయన్ గిరినుండుసర్పములువాసిన్ భీతిపారాడుచున్
గరళంబున్ వెలిగ్రక్క, ఖేచరులు భంగంబొంది స్వస్త్రీలతో
కరమర్ధిన్ శిఖరంబుపైకెగసి యాకాశంబువంకన్‌జనన్.

గీ॥ వానరశ్రేష్ఠుడైనట్టి వాయుసుతుడు
నభ్రవీధికి నెగసి దానబ్ధిదాట
జవమునందార్క్ష్యసరిబోవజాలుదునని
దలచి దక్షిణాభిముఖుడై తరలువేళ.

గీ॥ గగనమార్గమునంబోవు కపికులేంద్రు
నున్నతంబైన దేహమునొగిసువర్ణ
కాంతి వర్ణింప పక్షముల్‌గల్గినట్టి
మేరుపర్వతమోయన మెఱసె మిగుల.

సీ॥ ఆకాశమార్గమునందుత్తరపుదిక్కు
నుండి దక్షిణదిశ నొనరపోవఁ
దుఱగలించెడిమేటి
తోకచుక్కయనంగ నొప్పిన కపినాథునుద్ధతమగు
కాంతి లంకకు పీడఁ
గావింపఁగందని యింద్రాదిదేవతలింపె సంగ
నిజ విమానంబుల నిలచి నభంబునఁ
గన్గొనుచుండ నక్కపివరునకు.

గీ॥ తగిన సమ్మానమొనరించు తఱియిదియని
మది సముద్రుఁడు దలచి ధీమంతుడాద్యు
డైన మైనాకుడను పర్వతాధిపుగని
సుమధురోక్తులనిట్లను, సుచరితుడవు.

కం॥ తొలి శైలంబుల నెఱకలు
కులిశాహతి వాసవుండు కూల్చెడివేళన్
బలముడిగి భీతినీకి
జలధింజొచ్చితివి నేను సమ్మానింపన్.

గీ॥ రామకార్యార్థమై పరాక్రమయుతుండు
వాయునందనుడిద్దెస వచ్చుచుండె
నతని విశ్రాంతి నీ మీఁద నమలమతిని
గొనుట శ్రేయస్కరంబు నీకును శుభంబు.

వ॥ మున్ని క్ష్వాకు కులంబున సన్నుతి జన్మించినట్టి సగరునిచే నే
నెన్నగి వృద్ధింబొందితిననా శ్రీరామునన్వయంబదియగుటన్.

కం॥ ఆ మునకు సేవసేయగ నామది నెంచితినిగాన నామై కరుణన్
స్వామికిని విశ్రాంతిని ప్రేమన్ జేకూర్పుమీవు పెంపొందంగా

కం॥ పాతాళలోకమందలి దైతేయులు మగుడపైకిఁ దగరాకుండన్
ప్రీతిని నింద్రుండిటు నిను నాతతముగనిల్పె దీనినాత్మ దలపుమా.

గీ॥ రామ కార్యార్థియైదైత్యరాజపురికి
నభ్రపథమున నేగుమహానుభావు
డతిథియును పూజనీయుడునై రహించు
నితని కాతిథ్యమిమ్ము గిరీంద్రవడిని

కం॥ రాముడు సద్గుణధాముఁడు
భీమబలుండసురతతిని పీచమడంపన్
శ్రీమన్నారాయణుడే
యీ మహిజన్మించెనందు రింద్రాది సురల్.

గీ॥ స్వర్ణనాభుడ నీవు నీ స్వర్ణశిఖర
ములను విశ్రాంతిగొనిరక్కసులనడంప
సీతను వెదకఁబోవు విఖ్యాత చరిత
సమ్మతిని లెమ్ము యాతిథే యమ్మునిమ్ము

కం॥ రాముని మందితనంబును
భూమిజరావణునియింటఁబొగులుటమఱియా
సామీరిదూతకృత్యము
నీమదినగ్గించె దేని నెఱిపడి లెమ్మా.

చ॥ అనుట యు నగ్గిరీంద్రుడు సురాసురులాత్మముదంబు నొందగన్
బునిధిని నిర్గమించె పొలుపున్నెలరాజు వెలుంగులీల కాం
చనశిఖరంబు లొప్ప పెలుచన్, గగనంబును నాక్రమించు భం
గిని మది నా సముద్రుడును గిరి న్గని యెంత యు మెచ్చి చూడగన్.

గీ॥ ఇనుడు జలదముభేదించుకొనిరయమున
బయలు వెడలినకీతి నిర్భయమెసంగ
జలధిలోనుండి రమ్యకాంతులువిరియగ
వెడలెమైనా కుడరయచొప్పడయశంబు

ఉ॥ అంత సముద్రునాజ్ఞ నభమంటుచు కాంతులజిమ్ముచున్విన
స్వంతునివోలెకీపిని దిశావలయంబును నాక్రమింప ధీ
మంతుడు వాయునందనుడు మానసమందు దలంచె నౌర న
న్నెంతయు మోసగింప నితడేపునడాసినదైత్యు డేమొకో.

గీ॥ చాకు విఘ్నమాపాదింపనీ కరణిని
పర్వతాకారమూని దుర్గర్వవృత్తి
నిట్టు బెదిరించెనిక పినిమట్టుపెట్టి
లంక కేగెదగాక నిశ్చయకమతిని.

కం॥ అని యెంచి వాయుసూనుడు
ననిలుడు మేఘముల ద్రోలునట్టుల వక్షం
బున ...మైనాకంబును
గనుగొనబడద్రొబ్బెదాని గర్వమువాయన్.

సీ॥ ...తమ్మై ...కుండా హనుమంతుజూచి
భక్తితో మ్రొక్కి సి నిజశక్తినాకు
... వానర ప్రవర నీవు
... నౌటనభినందనీ నుడగుడు.

కం॥ అని ...నవాక్యతింగొని
...బొగడి వరల నత్యానక్తిన్
... దానిట్లను
కనుగొంటిని సి బలంబుమదుకర్భతమా.

మ॥ కరుణాంతఃకరణుండు రాముని సతిన్ గాలింపగా లంకకిం
ట్లరయన్ ధీమతినేగు నీదవము నత్యాశ్చర్యమౌ నా ఖగే
శ్వరుడేనిన్ భవదీయవేగమునకున్ సద్దింపగానల్పుడే
పరమానంద విలాస వైభవజగత్ప్రాణాత్మజా యోచగన్.

గీ॥ అనఘపరికింపనేరికినలవికాని
జలధిలంఘింప గొంకొన్న శౌర్యగుణుని
నిన్నుజూచితి-నన్ను గణింపనీదు
యంతరమునంద్రోసితివి ధైర్యమ్ముబ్బ కీర్తి.

కం॥ తొలిరాముని వంశంబున
కలిగిన సగరుండు నతని గారాపు సుతుల్
జలధినభివృద్ధసేయుట
వలన సముద్రుండు ప్రీతివహించి మదిన్.

కం॥ నిను పూజించిన రాఘవు ననురక్తిని గౌరవించినట్లగునని దా
మనమున నెంచి కపీశ్వర
నన్ప్రేరేపించె గొనుమునాద సపర్యల్.

మ॥ నను నీ మిత్రునిగా దలంచి మదిలోనస్ వానరశ్రేష్ఠ-రం
జనగా యీ శిఖరంబునందునిక విశ్రాంతిన్ దమించ్ పోవ్-సీ
తను శోధింపగ బొమ్ము మేలగుచు నా ధర్మంబు నీ చేత్పొ కొం
దును-మాన్యుండగు నీకు నేను సత్కృతిన్ దోరంగ గావింపగా

గీ॥ అతిథి పండితుడై నసుజ్ఞుడైన
నింటికేతేర నిష్టాన్న మిచ్చి తృప్తి
యవ్వడేనియు పూజింపడేని వాని
విద్యయును పుణ్య కీర్తియు పీటిబోవు.

గీ॥ వానరశ్రేష్ఠుడవు నీవు వాయుజుడవు
పండితుండవు సద్గుణ ప్రవకాండగుటు
భక్తి నిన్ను పూజించుట పాడియగును
దిటవుగా గొన్ము నాయాతిథేయమిపుడు.

సీ॥ కృతయుగంబునందొల్లి క్షితిధరంబులు పక్ష
ములుగల్గిగరుడునివలెజవమున
నెల్లదిక్కుల తేజరిల్లుచు విహరింప
మునులు దివ్యులు భయంబున దడదడ
వారి భయంబు నివారింప నింద్రుడు
కులిశాహతిన్ శైలముల నెఱకలు
ఖండించి నామీద దండెత్తు వేళపి
జనకుడునౌ ప్రభంజనుడునంత.

గీ॥ వేగమున నన్ను గొనివచ్చి సాగరమున
బలిమి బడవైచి రక్షించెన లఘుచరిత
పక్షములు కల్గినేను సురక్షితమున
కాంతి జెన్నారుచుంటిదినభస్వంతు కరుణ.

ఆ॥వె॥ అసురులందు మేటియన ఘుడై సత్కీర్తి
దనరుగంధవహుని తనయుడీవ
యగుట నిన్ను భక్తి నర్చింపననిలుని
పూజచేసినట్లు బుద్ధిదలచి.

గీ॥ నీకు నాతిథ్య మొసగెద నిర్మలాత్మ
వేడ్కనాశిఖరంబున విశ్రమించి
కంద మూలఫలాదుల కాంక్ష మెసవి
గగనసటన డీర్చుకొని లంక కరుగుమార్య.

మ॥ పరమానందమునన్ మనోజవమునన్ భావింపనంభోధి నీ
కరణిన్ వోవగనైనతేయునకు శక్యంబా గణింపంగ-ధీ
వర నీతంద్రినిబోలి వేగమున దివ్యాసీకమగ్గింప-జె
చ్చెరలంఘించితివెంచ వానరుల వాసిన్ లేదునిన్ బోల్పగా.

గీ॥ నీవు నా శిఖరంబున నిలచి నేను
జేయు సత్కారములగొని సీతకొఱకు
లంక కేగెదుగా కబలంబు మెఱయ
నలసటనుదీర్చుకొనుమిటునని వచింప.

కం॥ హనుమంతుడగ్గిరీంద్రుని
వినయవచోగరిమకలరి వినుతించుచు-మ
న్నన నిట్లను నామానస
మున నానందమును తృప్తి మొనసెగిరీంద్రా.

కం॥ ప్రియకరమగుమాటలన
వ్యయమగునా తిథ్యమొసగియనురాగమునన్
దయనీక్షించితి వెంతయు
జయమగు నీకనవరతము సద్గుణధుర్యా.

కం॥ లంకకు రవియస్తాంబుధి
క్రుంకకమును పేనునేగఁగోరితినెద-ని
శ్శంకను రామునిబాణముఁ
గొంకకవడి నేగురీతికోపింపకుమా.

గీ॥ అని ప్రియంబున బలికి యాయనిలజుండు
కరమునఁగిరిస్పృశియించిత్వరితగతిని
నంబరంబున కెగసి యాయంబునిధిని
మెచ్చితనదారిజనుచుండె నచ్చెరువున.

క॥ ఈ విధమున మైనాకుడు
పావని నర్చించు విధము పరికించి వేసన్
దివౌకసులు మునులు
పవనసుతున్ గిరిని పొగడ సమరాధిపుడున్.

గీ॥ పర్వతశ్రేష్ఠుమైనాకు పజ్జకేగి
సంపుతోషిల్లనియె పర్వతేశ నిన్ను
మెచ్చితిని- వాయుసుతునకు మేలు సేయ
నీవు గమకించితివిరామునీయకముగ.

శా॥ నేనే గాదు సమస్త దేవతలు యీనీ చేయుతోడ్పాటు నెం
తేనిన్ మెచ్చిరి- నీకు భద్రమగునో యీ స్వేచ్ఛగానుండుమా
నాం నేస్తంబును నైయశోన్నతిని- విఖ్యాణంబుగా- భీతియా
మైనాకాయిక లేదునావలన నిన్ మన్నించితిన్ సమ్మతిన్.

క॥ అని పలికి యింద్రుడేగిన
ననిమిషులున్ మునులు విస్మయంబందుచునా
హనుమంతుని దీక్షించుచు
జనిసురసాదేవికడకు సంశయమతులై.

గీ॥ ఓకిరిప్వ్యధి మధురసంభాషణముల
నల్లరేజాడుమమ్మ మహాంబురాశి
నభ్రపథమునలంఘించుననిలసుతుని
వాని తేజములావు జవంబమితము.

ఉ॥ నీవు భయంకరాకృతి- గణింపగదాల్చి మరుత్సుతుండుబో
త్రోవను నిల్చి వాని కవరుద్ధముగా బెదరింపబొమ్ము- ని
న్నే విధినంజనాతనయుడేర్పడ రక్తి జయించునో భయం
బావహిలన్ ధృతిండడలగ నార్తిదపించునొ తెల్లమయ్యెడున్.

తే॥ వె॥ అనిన నాగమాత యగుసురసాదేవి
సమ్మతించి హనుమ జనెడుదారి
వికృతమైనరూపు వెసదాల్చినిలచి వా
యుజునివంక జూచి హుంకరించి.

ఆ॥వె॥ నన్ను సురసయండ్రు నాగమాతనునేను
తిండి లేక పెక్కుదినములెంచ
యార్తినొందు నాకునాహారమునుబెట్టు
డను మనమరవరులనడుగవారు.

కం॥ నినుజూపించిరి కపివర
వినుమిక నేనిలువజాల_వేగంబుననిం
పున నాకాహారంబై
మనమగు సత్కీర్తి బడయగా దొరకొనుమా.

ఆ॥వె॥ అనినఁదెల్లవోయి, యనిలాత్మజుండంత
నాగమాత కెఱిగివేగిరమున
బలికెనిట్లు నీదు పలికినతీరెంచ
నచ్చె నన్ను మెక్కవచ్చు నీవు.

గీ॥ విన్నవించెదనొకమాట వినుముతల్లి
దశరథసుతుండు రాముడు ధర్మపత్ని
ననుజుడగులక్ష్మణునిగూడి యరయనడవి
నుండ రావణుడొకనాడునుక్కివమున

గీ॥ రామలక్ష్మణు లిరువురాశ్రమమునందు
లేనితఱిజానకిన్ నిర్మలినచరితను
బలిమిని హరించుకొనిపోయె పాపమనక
తొయ్యలినిగూర్చి రాముడు దుఃఖమొంద.

శా॥ సీతాన్వేషణ తత్పరత్వమునవాసింపన్సముద్రముండాటువి
ఖ్యాతిన్నే దొరకొంటి నందులకు విఘ్నంబీవు గావింపనో
మాతా బూనితివేల ధర్మమగునా మన్నించి పోనిమ్ము ఘో
రాక్రోతిందిన్నక్షుధానలంబడగునే గోపింపకన్జెప్పుమా

గీ॥ నన్నుదినుఁగోర్కె కలిగిన నా మనవిని
వినుము సీతను లంకలో వెదకిజూచి
రామునకు జెప్పియివ్వార్త రమణవచ్చి
నీకు నాహారమగుదేను నిజముతల్లి

గీ॥ మాటఁదప్పడు మారుతాత్మజుడునెపుడు
సీత సేమము రాముని చెవినివైచి
తిరిగివచ్చెదనా కానతింప్రియమున
నిమ్ముగా దారినేగెదనింపుతోడ.

ఆ॥వె॥ అనిన సురసనవ్వియనిలాత్మజునిఁజూచి
నన్నుమోసగించి మున్నుజనిన
వాడు నొక్కడేనిలే డింతవరకును
సరసిజాసనుండు వరమొసగుట

గీ॥ తికమకలు జాలుకోనన్న త్రిక్రమించి
యేగ సాధ్యమెదివ్యులకేనిగాని
వదన కుహరంబుఁ జొచ్చినవాలుమగని
నిన్ను కుడువక విడతునే నిందలేల

ఉ॥ వానరవర్య నిన్ను బలవంతముగా భుజియింతు జుమ్ము చు
క్కైనను నెందఱొడ్డినను హాయిగకుక్షిని నింపుకొందు నీ
జానకియున్ రఘూద్వహుడు సమ్మతి నిన్నిలగావచ్చినన్
జానుగనోడిపోదురిక సైపగజాల నిమేషమేనియున్.

గీ॥ అనిన కోపించి హనుమంతుడంత మీద
నిక్కిదశయోజనంబుల నిడివి-యంత
వెడలుపుంగలదేహము విస్మయమునఁ
బెంచినంజూచి సురసదా ప్రియమునొంది.

గీ॥ ఓజ వదనము నిరువది యోజనముల
నిడుపునధరింప మారుతినేర్పొలయగ
నున్నతివహించి ముప్పదియోజనములు
పెరిగె ఖేచరులెంతయు భీతినొంద

ఆ॥వె॥ మరల సురస దెఱచె పరికింపనలువది
యోజనములనోరు రాజితమున
హనుమడంతఁ బెరిగె వినుతింప నేబది
యోజనముల మేను-తేజమెసగ.

సీ॥ అతులిత బలధాముడైన వాతాత్మజు
దీర్ఘదేహముజూచి ధీరచరిత
యైనట్టి సురసదానరువదియోజనం
బులనోరుదెరచిన పొంగి హనుమ
పెంచెనుదనమేను పేర్మిడెబ్బదియోజ
నముల మేరకు నంత నాగమాతఁ
దెఱచెవక్త్రము భయాధిక్యతగొల్ప-న
శీతియోజనములు శీఘ్రగతిని.

గీ॥ స్వర్ణశైలాభదేహుడైసరభసమున
నవతియోజనముల వాయునందనుండు
పెరిగినంగాంచి సురసయాశీలవృత్తి
నూఱుయోజనముల నొప్పునోరుఁదెరచె.

కం॥ శతయోజనాయతంబును
నతిశయముసంబై ననాస్యమమరగనిడుపై
ద్యుతిజిహ్వాన్విత సురసన్
ధృతిగాంచిమరుత్సుతుండుఁ దీర్పతిగానన్.

గీ॥ వనమునందెంచెని నాగమాతయిట్లు
నన్ను భక్షింపఁ దెఱచుచున్నది వదనము
చిన్న దేహము గైకొని శీఘ్రమేను
వక్త్రమును జొచ్చితిరిగి వెల్వడుటమేలు.

కం॥ అనిదలచి సూక్ష్మరూపం
బునపావని సురసకుక్షి పొందికతోఁజొ
చ్చి నిపుణతన్ దావెల్వడి
వినయంబున నామెకెఱగి విజ్ఞతమెఱయన్.

గీ॥ పలికె నీనోటబడకుండ ప్రాణియెన్న
పారిపోజాలదనినీకు బ్రహ్మవరము
నిచ్చుటను జేసినీకుక్షియేనుఁజొచ్చిఁ
దనిపితింగదయీాశీతి దక్షతనయ.

కం॥ శ్రీరామునిదేవేరిని
వారయసేలంక కేగ నాజ్ఞనొసగుమా
ధీరాన్వితనీయానతి
ధీరతముంగళముతెసగు దీవింపుమనన్.

ఆ॥వె॥ అట్లుఁదనముఖంబునందుండి వెలువడి
రాహుముఖమునుండి రవివెలువడు
చంద్రునట్లుదీప్తి నొంద ననిలజు
నరసిసురసయిట్లనియెఁబ్రీతి.

తే॥ కార్యసిద్ధియగుతకడురయంబుననేగి
రక్కసులనుజంపి రాముతోడ
నతనిభార్య సీత ననురాగమునజేర్చి
యవనిరామడూతయునవెలయుము.

కం॥ అని సౌమ్యాకారంబున
హనుమంతుని మెచ్చిసురసయము రాక్షసికిన్.
జనినన్ వాయుతనూజుడు
ననిలుసివలెగగనపథమునందు జనంగా

చం॥ గమనమునన్ ఖగేశ్వరునికంటె గణింపగసీతడెక్కుడౌ
సుమనసులన్ జయింపగల శూరుడు నీ హనుమంతుడంచు-ఖ్యా
తములునుతింప నంబునిధి దాటరయంబునవేగుచుండ-వి
క్రముడగు వాయునందనుని రక్కసి సింహికజూచియుబ్బుచున్

గీ॥ వచ్చవచ్చిన రూపమునింపుమీరం
దాల్చునదిగాన నడిపర్వతమునుబోలు
దేహమును పెంచియోచించెతిండిలేక
బాధపడుచుండపీడు నాబారిజిక్కె.

కం॥ తనియుదనే నీకోతని
ననిజలనిధినుండినదియు ననిలజుమైని
డనుబట్టి యీడ్వనాతడు
దనగమనము కుంటువడ తపలచిమ నమునన్.

చం॥ అనిలునివోలెనాకసమునందురయంబునబోవునాడునీ
డను పదెయొక్కరక్కసిదటాలునబట్టిన నాజవంబు నె
క్కొనవడిదగ్గనిజ్జలధి కూరిమిడాగిన యున్నిశాచరిం
డనిమిహతూటిపాటింజనెద దర్పదమైన దశాస్యుహీటికిన్.

క॥ సుగ్రీవుడుఁ దొలిదెప్పెడి
శ్రీగ్రీవున్ముజ్జ జలధి సంచారిణి ఛా
యాగ్రాహిణ్యైన జంతువు
గ్రహము, మ్రింగవచ్చునని యదియిదియౌ.

క॥ అనియెంచి వాయుసూనుఁడు
తనదేహముకుఱుచజేసి తడయక శీఘ్రం
బునసింహికకున్ నిబడి
ఘనముఖములజీల్చి జంపె కంపింపదెసల్.

గీ॥ సింహికనుజంపి యక్కపిసింహుఁడంత
నభ్రపథమునకెగసిన తనిజూచి
సర్వభూతములవ్వేళసంతసమునఁ
బలికెమెచ్చుచు నీకు శుభంబులగుత.

ఉ॥ ధైర్యము సూక్ష్మదృష్టియును, ధర్మగుణజ్ఞత కార్యసిద్ధి గాం
భీర్యము విక్రమాఢ్యతయు పేర్మియశంబునెసంగ సద్గుణౌ
దార్యములన్ క్రమంబున ముదంబున నొప్పెదు నీకనారతం
బార్యజెలంగు మంగళములా రఘురామునిసేవనిద్ధరన్.

గీ॥ సమ్మహాసత్త్వమును మదియింపనీకు
గా కనస్యులవశమౌనె గరుడునివలె
జవమునంబొమ్ము లంకకు జయముకలుగు
ననుచు దీవింప హనుమంతుడాత్మవలరి.

క॥ మునముపసురలకు మోదము
జనియింపగ రక్కసులకు జంకొదవగపా
వనివెసనూజామడలా
ననధిన్ లంఘించి ధీరవర్యుండగుటన్.

గీ॥ పడిసువేలాద్రికొమ్ముపై ప్రాలిఁ గాంచె
నల్లత్రికూటాద్రిశిఖరములందు నొప్పు
చున్న లంకను కౌతుకముట్టిపడగ
వాయుసూనుడు నాశ్చర్యవదనుడగుచు.

సీ॥ పద్మోత్పలాయుత ప్రభలీనుబావులు
పుష్పవాటికలునుఁబొలుపుమీరు
యుద్యానవనములు నొగికాంచనాన్విత
ప్రాకారముల బహిర్ద్వారములను
రత్నస్థగితములౌరాజమార్గంబుల
దుర్గమమైనట్టి దుర్గములను
మరకతమాణిక్యమణులనుద్భాసించు
గోపురంబుల కొల్వుకూటములనుఁ

గీ॥ గలిగి సురలోకమోయనుకరణినొప్పి
స్వర్ణకుడ్యంబులును గవాక్షములతోడ
దీప్తినొప్పారుబహువితర్దికలతోడఁ
గాంచెరమణీయమైన లంకాపురంబు.

గీ॥ నీతికోవిదుడగు యంజనీతనయుడు
నిట్లుజింతించెమది దనుజేంద్రుపురిని
పర్వతాకారమూనియిప్పగిదినేనుఁ
జొరబడుటభావ్యమౌనె విజ్ఞాలకుదగునె.

ఆ॥వె॥ కానసూక్ష్మమైన కాయంబుగైకొని
లంకజొచ్చి దైత్యులఁగికురించి
రామచంద్రుసతిని, రాజీవగంధిని
వెదకువాడపురిసి విన్నసువున,

గీ॥ ముందువెనుకలనరయక మూర్ఖబుద్ధి
పండితుడననిగర్వించి, పార్థివునకు
కీడుగల్గించు. దూతదుష్కీర్తినొందు
నంతియేగాదునరకమునందుగూలు

ఈ॥ యుపరోహకాలమున
నెవ్వదిపోనగు లంకకేను, నా
కాయమునింతయున్నతముగాఁ
గనవచ్చిన, రాక్షసాళి నా
ధ్యేయమెఱుంగకుండుట
[illegible]దించుచుదాకిన యుద్ధమగ్నతన్
రోషముటనెట్లుసీతనుఁ దిరోహితమౌ
[illegible]కార్యమిత్తఱిన్.

[illegible] నావచ్చినపని రాముని
దేవేరినివెదకుటరయ ధృతి నాపిదపన్
దేవారుల దుష్టుడునౌ
రావణుకుదప[illegible]డపవలయు రాజితకీర్తిన్

[illegible] [illegible]శ్వకర్మచేత విరచింపబడి హేమ
[illegible]జతసౌధములను రమ్యమగుచు
[illegible]జతశైలమట్లు రాజించులంకను.
[illegible]చె [illegible]డప్పచూలి కౌతుకమున.

[illegible] [illegible]లె మేల్మియంత్రముల భాస్కరతేజను తోడనొప్పు గో
[illegible]పురములు ఫీకరాకృతులపొంగెడిదైత్యుల కంటికింపునౌ
[illegible]కొనుకీరియోధుల నపూర్వమునౌగజశాలలన్ భయం
[illegible]గ[illegible]శ్వశాలలను కావలివారలఁ జూచెనాతడున్.

కం॥ స్వర్ణప్రాసాదంబుల స్వర్ణస్థంభములచేత సౌందర్యమునన్
స్వర్ణాద్రిఁబోలునిదియని వర్ణించుచురామదూత
వలనువెలుఁగుచున్.

మ॥ తనలోనిట్లుదలంచెవాయుజుఁడు
నేఁడాత్రీజసేమంబుమె
ల్లనశోధించియెఱుంగ సూక్ష్మతనువున్ లావొప్పగాదాల్చి యిం
కనునేఁజొచ్చెదరాత్రికాలమున లేకన్దైత్యులీవేళఁజూ
చినకార్యంబుఁజెడున్ మహాహవమగున్ శ్రేయంబుదూరంబగున్.

ఉ॥ దూతవివేకశూన్యుఁడును దుర్మతియైప్రభుకార్యమెంచ దు
ర్నీతిఁద్రోసిపుచ్చిన ననేకవిధంబులచేటునొందు__నే
సీతనుజూడనేని వడిసింధువుదాటుటనిష్ఫలమౌ జనం
బేతలపోయ రాఘవుని ప్రేయసినింగనుగొందు ముందుగాన్

గీ॥ లంకశోధించెదనుగాక లలనకొఱకు
నన్నిసౌధములందు నుద్యానవనము
లందు గుహలందు__నాతల్లియైనసీత
నరసిక్రమ్మఱనేగెద నబ్ధిదాటి.

చం॥ గిరిశిఖరంబునందు పరికింపగనొప్పుచు- విశ్వకర్మచే
విరచితమైనరావణునివీడు భయంకరులైన దైత్యకిం
కరులు బలాఢ్యులెప్పుడును గావ సురక్షితమైజెలంగు నీ
పురమునమైథిలిన్ వెదకి పొంకమడంచెదవీరపర్యులన్

గీ॥ రాక్షసులచేత దుష్టసర్పములచేత
భోగవతివోలెనొప్పు నీపురిపోలుదలప
కపులుచొచ్చుటమిగులదుర్గమముఁగాన
రాఘవులువచ్చుటెట్లు పరాక్రమింప

గీ॥ దనుజరూపముదాల్చి యిత్తరినిలంక
కేగినన్నన్నుఁ గనుగొందురీయసురులు
ననుచు సూర్యాస్తమయమగునంత హనుమ
పిల్లిరూపముగైకొని ప్రీతినొంది

కం॥ లంకానగరద్వారము శంకాలేశంబు లేక సత్వరమున
సడ్డంకులఁద్రోయుచు వోవుచు
ఘీంకారముసేయుకరుల క్రేవన్జూచెన్

కం॥ జలదంబులతారకలన్
తలపంగాదాకుహర్మ్యతతినొప్పుచు ను
జ్జ్వలమగుప్రాకారంబుల
నలసమరావతినిబోలి హాయినెసంగన్

గీ॥ దానవులయిండ్లు గొప్పముత్యములరత్న
మరకతశ్యామ వైడూర్యమణులచేతఁ
దలపగనలంకృతంబులై ధవళకాంతి
చంద్రికలవలె తెక్కెముల్ జానుమీర

ఉ॥ దారుణమైన శూలములదాలిచి దుష్టమతుల్ భయంకరా
కారులు ధూర్తవర్తనులు కాలునిదూతలవోలె లంకలో
వీరులుదైత్యపుంగవులు విశ్రుతకీర్తిని రక్షకత్వమిం
పారగనూనియేమరక నర్మిలి కాపలిగాయుచుండగన్.

గీ॥ వారలందరఁజూచి యావాయుసుతుఁడు
మనమునందిట్లుచింతించె మఘవుఁడేని
యీపురంబును జేర నెంతేని వెఱచు
రాఘవులువచ్చుటెట్లు ధీరమతినింక

అంగద సుషేణ శరభులు నర్కతనయ
నీల నల జాంబవంతులు నిర్భయమున
నాక్రమించెదరీలంకయనిదలంతు
సంధియంబగు రామలక్ష్మణులుజోఅగ

ఈనగరంబు స్వర్గమునకెంతయు
మిన్నయసంగనొప్పు నుం
తైనకొఅంతలేదు మలయానిలమెప్పుడుహాయిగూర్చ నా
భానుడుత్తేజమంబఅప
భావమునంభయమొందు-చంద్రుడున్
జానుగచంద్రికల్విటియ
సౌఖ్యవహుండగు సముద్రదంబునన్.

మణులకాంతులు వస్త్రంబుమాడ్కనొప్ప
నున్నతములైన సామగ్రులుండుకొట్లు
కర్ణతాటంకములగతి కాంతిమీర
జంత్రములనొప్పు గృహములు స్తనములట్లు

తులతూగున్గద రత్నసౌధములకాంతుల్మేనభాసించు సా
మ్ములరీతింగనుపింప యౌవనమునన్
మోదించుకాంతామణీ.
దలపించున్ దనుజేంద్రపాలితమునై తథ్యంబు లంకాపురం
బిల దీనింబొగడంగశక్యమగునే యెవ్వారికైనన్ తతా!

## లంకను హనుమంతుడు నిర్జించుట

మ॥ అని లంకాపురిఁజొచ్చువాయుజుని
విశ్వారాధ్యునీక్షించి-లం
కనిబంధించుచు రాక్షసాంగనవలెన్ గన్పట్టుచున్ రక్తలో
చనముల్ భీషణమైనవక్త్రమమరన్ సంవేగముంజెంది పా
వనితోనిట్లను వానరాకృతిని దుర్వ్యాపారనిత్తుండవై

కం॥ నీవెవడ వేలవచ్చితి
రావణపాలితమునౌ పురంబునుఁజొరగా
దేవతలకేని సాధ్యమె
భావింపగ వచ్చుటిందు పలుకుముత్వరగా

కం॥ నేలంకానగరంబును నీలావుం జవము శక్తి నేర్పు సహింపం
జాల వినువానరాధమ యీలంబొనరింతు వేని
యడగింతుపసన్.

గీ॥ అనిన హనుమంతుడాలంకకనియె నిట్లు
వికృతరూపము నేత్రముల్ వెలయనిట్లు
నన్ను వెఱపించుచున్న నీనామమేమి
కామరూపిణీనీవు నిక్కముదలంప

ఉ॥ నేనొకవానరుండను గణింపదశాస్యుపురంబునైన లం
కానగరమ్మునందు తమకంబుననొప్పువనంబులన్ ఫలో
ద్యానములన్ గృహాంబుల భయంకరరూపులు విక్రమోద్యత
దానవులన్ గనుంగొనముదంబునవచ్చితి నిత్తఱిన్ వెసన్

శా॥ ప్రాకారంబులు దుర్గముల్ భవనముల్
ప్రాసాదముల్ చైత్యముల్
వ్యాకోచంబగుపూలదోటల గృహోద్యానంబులంజూడగా
నాకాంక్షించి గణింపవచ్చితిని నాకాటంకముంగూర్చి యు
త్సేకంబూనిపరాభవించెదవు యిస్సీధర్మరాహిత్యవై

కం॥ రావణపాలితమగుపురి
దేవేంద్రునిపురముకంటె దివ్యంబనుచుఁ
కోవిదులుజెప్పవచ్చితి
కావున నగరంబుజూడగాఁ బోనిమ్మా

గీ॥ వానరుడనేను నాతోడవాదమేల
లంకశోధించి మగిడి జలధినిదాటి
వెడలెదను నాకునాజ్ఞపవిత్రమతిని
ధృతినొసంగుము నామీదద్వేషమేల

కం॥ ఇంగితమెఱుగక నాపై
యంగవికృతాస్యవగుచు నదలించెదు యి
ట్లంగిని భావ్యంబగునే
భంగింపగ కోతిజూచిభయపడఁదగునే

చం॥ అని హనుమంతుడంతట పునాభిముఖుండునునైజనంగ హు
మ్మనియఱచేత లంకపవనాత్మజుని(ప్రహరింప మండియా
యనిలతనూభవుండును రయంబున లంకిణి జుట్టుబట్టి నే
లనుబడవైచి గ్రుద్దెనుబలంబడగఁ దపియింపరక్కసిఁ

కం॥ హనుమంతుని పిడిగ్రుద్దున తనదేహముపిండిగాగ తత్తరపడి యి
ట్లనులంక నూరుతింగని వినుషంగనఁజంపరాదు విజ్ఞానులిలఁ

ఉ॥ ఎవ్వు మహానుభావుడవు నీతివిదుండవు వానరోత్తమా
నీవెలదిగ భయంపడితి నీపిడిగ్రుద్ధున నన్నుమయ్యెనా
చేవ_విరింవి నాకుదయచే సెవరంబొకదానితొల్లి లం
కావినుమొక్క వానరుని గాటపుగ్రుద్ధున మేనునొవ్వగ.

గీ. సకలమానసమైన నావేళనుండి
లంకకుంజేటుగల్గుఁ దలంచిచూడ
ననుచు-నీనాడు నొచ్చెనాయంగకములు
నింకదాపగనేల కపీంద్రవినుము.

ఉ॥ నీతిదొలంగి రావణుడు నీచమతిగ బలిమిన్ హరించెనా
సీతను_దానినిప్పురము శ్రీఘురామశరాగ్నిదగ్ధమై
భీతిఘటించు దానవులపీచమడంగు భవన్మతంబునం
బ్రీతినెసంగు రామునియభీష్టములున్ నెఱవేరునెంచగ

మ॥ వినుమార్యా! నినురామదూతవని యన్వేషింపధాత్రీశు ని
ద్ధనుజాధీశుపురంబుజేరితని సీతంజూచి శ్రీరామచం
ద్రునకావార్త నెఱుంగజేసెదని ధూర్తుండైనలంకేశ్వరుం
డనిగూలంగలవాడటం చెరిగితిన్ హర్షించితిన్ గ్రీవరా

గీ॥ నాకువరమిచ్చె లోకేశుడీకరణిని
నతులితబలుండునగు వాయుసుతునివలన
నీదుదేహమునొచ్చిన మేదురమును
గిక్కి-చెడులంకయని దొల్లి నిక్కువముగ

ఉ॥ రావణపాలితంబు నమరావతికీడగునట్టిలంక నే
డీవిధి నీపరాక్రమము నేర్పునజూపి జయించి నీవుదా
రావణుకీర్తిమాయ సుకరంబుగజొచ్చి విదేహసంభవన్
వినుతప్రభావ గణుతింపగజెచ్చెర నూరడింపుమా

కం॥ అని బలికెడియా లంకన్
హనుమంతుడుమెచ్చి యామెయాడుదియగుటన్
కనికరమునవధియింపక
జనియెన్ లంకాపురంబు సరగునజొరగా

గీ॥ వానరశ్రేష్ఠుడైనట్టి వాయుసుతుడు
కామరూపిణియైన లంకనుజయించి
దర్పమెసగ ప్రాకారముదాటి రాత్రి
వేళలంకనుజొచ్చెను విక్రమమున

కం॥ ద్వారమున శత్రుపురమునుఁజేరనిషిద్ధంబ ననుచు
శీఘ్రంబున ప్రాకారముదాటి ప్రియంబున
నారావణుపురముజేరు నవసరమందున్

గీ॥ శత్రుపురముప్రవేశించు శౌర్యధనులు
వామపాదము మోపవలయుననుచు
గీష్పతిమతంబుగాన నాకేశవసుడు
ప్రీతివామాంఘ్రిలంకనుబెట్టి నిలచె

మ॥ బలవంతుడగువాయునందనుడు
దర్పంబొప్ప లంకాపురిన్
గలసౌధంబుల రాజమార్గముల
విక్రాంతిన్ బరికాళించు దై
త్యుల శూలాయుధపాణులన్
మదయుతుల్ దోర్వీర్యసంపన్నులన్
గలయన్జూచె గృహంబులన్
మణిమయత్కాంతుల్ బిసాళింపగా.

# హనుమంతుఁడు సీతను వెదకుట

గీ॥ ఆత్రికూటాద్రిశిఖరమునందు నొప్పు
లంకయందలి భవనములన్ విలాస
మైనకృతకాద్రులను ప్రియమారఁగాంచి
స్వర్గమిదియని విభ్రమస్వాంతుఁడగుచు

గీ॥ మంగళకరంబులున్ రత్నమయములగుచు
ధవళమేఘంబులనుబోలి దనరు సౌధ
తతులఁజూచుచు వాయునందనుఁడు పేర్మి
నవనిజను లంకఁజూచెనని దలంచె

కం॥ భవనంబులఁ బరికించుచు నవనిజ శోధింప మిగుల నాతురతన్ గ్రీ
రవరుఁడునగు హనుమంతుడు
పరివిమలమతిఁజూచె సౌధరాజములవెసన్

సీ॥ ఒకయింటినుండి వేరొకయింటికేగుచు
రామపత్నిని జెచ్చెర పరికింప
మారుతిదర్శించె మద్యముసేవించి
మత్తులై యానందమగ్నహృదయు
లైమంద్రమధ్యమమైనస్వరంబుల
మధురంబుగాపాడు మదవతులను
నప్సరాంగనలట్లు నతిసోయగముమీఱ
సందెలర శిఖాస్య బుగాగ

గీ॥ ప్రియుల పరిరంభణంబుల పేర్మి నెసగి
స్వర్గసుఖముల బడసిన చందమెనయ
పారవశ్యమునందూగు భామినులను
రక్తిఁ దిలకించె లంకను రామదూత

ఉ॥ కావలివారలన్ వికృతకాయుల నిత్యజపాగ్నిహోత్ర దీ
క్షావరులన్ బలాఢ్యుల నిశాతులభీకరగాత్రులన్-దశ
గ్రీవపురంబునందు పరికించెను మారుతి వేదమంత్రశి
క్షావిధిహోమయాగముల సల్పెడి దైత్యుల నీతివేత్తలన్

గీ॥ రావణుపురంబు రాజమార్గంబునందు
విడిసి పురమును రక్షించు వీరవరులఁ
గాంచె సామీరి కఠినకర్కశవికార
గాత్రులను విక్రమాఢ్యులగాంచె హనుమ

గీ॥ గుఱ్ఱముల భద్రగజముల కూర్మి నెసగు
రథములను కేతనంబుల రమ్యకాంతి
నొప్పినగవాక్షములగల్గును త్తమంపు
గృహములప్పురి దర్శించె కీశవరుడు

సీ॥ పరికించె నొక చోటపావని యగ్నియందాభిచారిక
హోమమాచరించి
శత్రుజనంబులజంపెడివారిని
వేరొకగృహమందు వికృతముఖుల
సుందరాంగుల రణశూరులనేకాక్షు
లను నేకాక్షుల లలితవదను
లను కుహూపుల ధీరులను నేకకర్ణుల
బహుకర్ణులను గార్దభముల నుష్ట్ర

గీ॥ ములను నాయుధశాలల
ముజ్జగముఁ బండియొనరించు జాతెడి భీషణాస్య
విక్రములఁ జూచె నింటింట వెదకి వెదకి
రావణుపురంబునందు నా రామసీత

గీ॥ ప్రణయకలహము విడనాడి
రతిసుఖముల కామినీకాముకులు స్వేచ్ఛగా సుత్న
కేళినొప్పారగా పరికించె నొక్క గృహము నందును
పేర్మి సుగ్రీవసఖుడు

చం॥ కమలముఖుల్ మనోధవుల కౌగిలి సమ్మదమొప్ప పారవ
శ్యమున జరింప నొక్క గృహమందు కనుంగొని వెండి యొక్క
ధమున పతివ్రతామణి ముదంబున
కాంతుని చెంగటన్ ప్రమో
దమున మనోజ సౌఖ్యముల తద్ద సుతృప్తి వహింపఁ గాంచుచున్

గీ॥ భర్తృసంగమమున దిగంబరులు నగుచు
సురతసుఖముల క్రీడించు సుందరులను
తప్తకాంచనవర్ణుల ధవుని బాసి
విరహమున గుందు సతులను వెండి గాంచె

సీ॥ సౌందర్యవతులైన స్వాధీనపతికలు
నాథుని గూడి యానందమొంద
వాసకసజ్జికల్ వరుని రాకను గోరి
శయ్యాగృహంబుల జక్కబఱుప
విసివించి కాంతుని విడనాడి
ప్రియునకై కలహాంతరితలు దుఃఖమునఁ గుముల
కాంక్షనూని విరహోత్కంఠితల్
దమ్ప్రియుఁ డాలసింపగ విరహార్తినొంద

గీ॥ పతినిదర్శింపప్రోషితభర్తృకలును
దాపమొందగ విప్రలబ్ధలనువిరహా
గతిదపింపగ ఖండితల్ గలవరవడ
ప్రియులనభిసారికలుగూడి ప్రియముబొంద

కం॥ ప్రీతింజూచుచు హనుమడు
సీతనుదర్శించుఘాంధ శ్రీమమునన్ వి
ద్యోతించుచు లంకాపురమాతతముగ
సంచరించె న మోదమునన్

కం॥ రతికార్యోత్సాహాన్విత
మతులై యానందిమొనగ మచ్చికవిటులన్
ధృతిలాలించి సుఖించెడి
సతులన వెలయాండ్రగాంచె సామీరియటన్

గీ॥ రామపత్ని సగుణానిజ రమ్యగాత్రి
సమలచారిత్ర పక్వబింబాధరోష్ఠి
తన్వి నేణాక్షియైన సీతనుగనుగొన
పేర్మిలంకను హనుమపరిభ్రమించె

చం॥ పరమపతివ్రతామణి సుభాషిణి నిర్మలినాంగి సద్గుణా
భరణ సుగాత్రి చంద్రముఖి పావనశీల దయాంబురాశి గుణన్
సురదన రామపత్నియు యశోధన సీతను గానకున్కి ధీ
వరుడగు వాయునందనుని వక్త్రము వాడ విషాదయుక్తుడై

ఉ॥ రాముని బాసి రావణుపురంబున నొంపిదపించు సాధ్వి సీ
తామహిళన్ కృశోదరిని ధన్యచరిత్రను మత్తకాశినిన్
శ్యామను జూడనైతినని చాలదపించినునంబునందు నా
రాముని బంటుజొచ్చెవడి రావణసౌధము వేగరంగునన్

ఆ॥వె॥ సూక్ష్మరూపమూని శోధింపసీతను
అంజనీసుతుండు నసురవిభుని
గృహముజొచ్చి చెమ్మగిలసకన్నులతోడ
వదివి దుఃఖమెనయు మచ్చరమున.

గీ॥ కడుభయంకరులైన రాక్షసులతోడ
నెలమిరక్షింపబడుచుమహేంద్రభవన
తుల్యమౌ దశవక్త్రునిదుష్ప్రవేశమైన గ్రుముజొచ్చె
నయ్యనిలజుండు.

ఉ॥ తోరణముల్ సువర్ణమయదుందుభులున్
రథముల్ దురంగముల్
వారణముల్ మహారథులు
వారిజనేత్రలతోడనొప్పి ప్రా
కారములున్ మనోజ్ఞమయ కాంతియుతంబులనౌ
శ్రీరమణీయవర్ణముల చిత్రమునై
పెనుపొంద జూచుచున్

సీ॥ రక్షింపదిరుగాడు రాక్షసశ్రేష్ఠుల
సౌందర్యగాత్రులౌ సుందరులను
రాజచిహ్నంబులరాజిలు ఛత్రచామరముల
సౌగంధ్యభరితములగు
చందనాగరు మకరందాన్వితపువిరుల్
భేరీమృదంగశంఖారవములు
గొప్పరత్నంబులనొప్పెడు కాంతులు
బహువిధమణుల దుస్సహమునగుచు.

గీ॥ నందనవనంబునిఁ తలక్రిందుజేయు
సకలతరులును రామణీయకతమీర
మానసీయంపుపుష్పితోద్యానవనము
నందుగనుగొనె రావణుమందిరమును

కం॥ రత్నసమాకీర్ణంబును రత్నపరిచ్ఛదము సౌధరాజమనంగా
నూత్నపుకాంతులవెలిగెడి ప్రత్నమునౌ
దానిజూచె పావనిఁగడిమిన్

గీ॥ రావణునియిల్లు లంకాపురంబునకును
భూషణంబనిభావించి పొంకమునగు
నేనుగుల గుజ్జములనొప్పునిధిగణింప
దివినితలదన్ను ననుచు మదిందలంచె

కం॥ హనుమంతుఁడుఁ జింతించెను
దనమనమున పూతచరిత తరలాక్షియునౌ
జనకజనుజూడవచ్చితి దనుజుని
చెఱఁదవిలియుండదగు నిచ్చోటన్

గీ॥ సీతయెట్లుండెనో! భర్తృచింతనమునఁ
దలపనామెగృశించి యిద్దైత్యుచేత
పరిభవింపగబడెనో కృపన్విడువగ
నిచ్చకోలదితిరుగుచుండెనేమొ యిచట

కం॥ నేనింతదనుక సీతను
గానంగానైతిగాన కరుణామయినౌ
జానకినినూహనెఱుగుట
మానితమతినాకుదగుసమర్థుడనగుటన్

చం॥ అనిదలపోసి రాముని ప్రియన్ హనుమంతుఁడు
లంకలో ప్రియం గానవెదకఁదలంచి
మదిఁబొంగుచు రాక్షససౌధములన్ వడిన్
గనుగొనుచున్ మనోహరముగాదిరుగాడుచు పూఁతోటలన్
సనిశితవృత్తిగాంచుచు
యశోధనుఁడేగె ప్రహస్తునింటికిన్

గీ॥ అందుసీతనువెదకి మహాబలుండు
పరగనేగి మహాపార్శ్వభవనమందు.
జనకనందనవెదకి వేసరకబోయె
కుంభకర్ణునిగృహమందు కూర్మివెదక

చం॥ ప్రియమునవాయుపుత్రుడు
విభీషణుగొప్పగృహంబునందు ని
శ్చయమతిసీతకై వెదకి సాగిమహోదరునింటజూచి-ని
ర్భయముగ వజ్రదంష్ట్రుడనురాక్షసుసౌధమునందు వెదకి
ర్జరగునిగృహంబునన్ వెదకె
చంద్రముఖిన్ హరిణాక్షిజానకిన్

కం॥ జవమున విద్యుజ్జిహ్వుని
భవనంబున వెదకి శుకుని భవనంబందున్
పవమానసుతుడువెదకెను
నవనిజరాకేందుముఖిని నతిమోదమునన్

కం॥ విద్యున్మాలిగృహంబును
సుగ్రీవ విక్రముని రోసి యుగ్రీవతనయన్
విద్యుద్రూపునిగృహమున
నుత్సాహమునంబునందు నరిగిగాలించెన్

సీ॥ విభీషణునియింటిలో వెదకి
విరూపాక్షుగృహమును ధూమ్రాక్షగృహమునందు
వజ్రకాయుండనువాని గృహంబును
సారణవికటులసౌధములను
నాగవజ్రునింట యుద్ధోన్మత్తు గృహమును
సూర్యకేతుని లోమశులగృహములు
నింద్రజిద్గృహమును నింద్రజిహ్వుని
మత్తుగృహము ధ్వజగ్రీవుగృహములందు

గీ॥ బ్రహ్మకర్ణ సుమాలుల భవనములను
జంబుమాలిగృహంబును సర్పరోము
గృహము వృశ్చికరోమునిగృహములందు
రాముకాంతనన్వేషించె రామదూతు

చం॥ దనుజులసౌధరాజముల
ధైర్యధనుండు మహాబలుండు నా
యనిలజుడున్ప్రియంబున
రయంబునసీతనుగాంచ లంకలో
గానికానిస్వేచ్ఛగాదిరిగి కోవాలినెందునుజూడనైతి నం
చనుమదిగుంది వెండిపరిశోధన జేయదలంచెచెచ్చెరన్

గీ॥ కాంతిమంతుడునగు హనుమంతుడంత
గుణమణిన్ రామునసతిని రావణునిగృహము
నందుశోధింప నతులితానందవృత్తి
నేగియచ్చోట ఘోరుల ధీగుణులను

గీ॥ ముద్గరంబుల దివ్యాస్త్రములను గదల
ఖడ్గములదాల్చినట్టి రక్షకభటులను
సుందరాంగులౌ స్త్రీలనుజూచెరావ
ణాంతిపురమున పీరుఁడయ్యనిలజుండు

క॥ ధవళారుణవర్ణంబుల
జవమునను చైత్రాశ్వనంబు సాటియునౌ వా
రువములరావణునింటను
పవమానసుతుండురక్తి పరికించెవేసన్

క॥ ఐరావతమునుబోలెడి
వారణములజూచి మగుడవాయుతనూజుం
డారావణునిగృహంబున
నారామమునందుదిరుగు యతివలజూచెన్

క॥ సుందరశైలనిభంబును
సుందరబహురత్నచిత్రశోభితమును నా
నందకరంబగురావణు మందిరమునుజూచి
వచ్చి మారుతియంతన్.

క॥ ఉత్తమమైనగృహంబును
నుత్తమయానములనొప్పు యువతుల శౌర్యో
పేతులరక్షకభటులను నత్తరిపీక్షించె
మారుతాత్మజుఁడెంచన్.

గీ॥ స్వర్ణవైడూర్యరత్నగవాక్షములనుగలిగి
కన్నులపండువై కడుమనోజ్ఞ
శిల్పశుభంకరమగుచు హృద్యంబునైన
పుష్పకవిమానముసుజూచి పొంగెమదిని

సీ॥ స్వర్ణవైడూర్యప్రవాళరత్నంబుల
విశ్వకర్మ విరించివినుతిసేయ
నిర్మించెఁదొల్లి వర్ణింపశక్యముగాని భంగి
పుష్పకముఁను బ్రహ్మకతఁడు
నిచ్చెదానికు బేరుకింపుగానయ్యది
ధనపతిన్ బాహుయుద్ధమునగెలచి
రక్తి వంచనగొనె రావణుడీపుష్పకమును
విశాలమై కాంతి మీరి.

గీ॥ యర్ధయోజనవృత్తమునగుచు
సార్ధయోజనాయతమైయొప్పి యున్నతమున
భర్మనిర్మితమై ప్రీతిపాత్రమైన
దానినవ్వాయుసుతుడు చోద్యమునగాంచె.

సీ॥ మరకత వైదూర్యమాణిక్య
మౌక్తికకాంచనస్తంభ ప్రకాశితమును
నుజ్జ్వల రత్నమయోన్నతప్రాకార
భానుతుల్యప్రభా భాసితమును
బహుమణిచిత్రిత పరమాద్భుతమ్మును
మేరుమందరనిభా మేదురమును
స్ఫటికనిర్మాణ సోపానయుతంబును
పుష్పసుగంధసంపూజితమును

గీ॥ పరగసుందరములునైన పక్షములును
కామగమనంబుకలిగి విక్రాంతి నింపు
గొలుపు నవ్విమానము నెక్కి కూర్మిహనుమ
గాంచె సౌందర్యవతులగు కామినులను

కం। మసిరాపానమదంబున
మదవతులనుజొక్కిసోలి మదిమదినిద్రన్,
బొదగొని యటశయనింపగ
విదితయశోధనుపు కీశపీముడు జూచెన్.

చం॥ వనితలుకొందఱచ్చటువివస్త్రలునై శయనింప కొందఱం
గనలుప్రియుండునాడల ని కాంతలబిగ్గరకౌగిలింప రం
జనసతులన్ధవుండనుచు. సమ్మతిముద్దిడునట్లునొప్పరీ
తిని శయనింపజూచె గణుతింపగ వాయుసుతుండు నత్త

కం॥ నక్షత్రములనుగూడిన
నక్షత్రేశునివిధంబునను రావణుడున్
చక్షుఃప్రీతినొనర్పగ
వీక్షించెనుసుదతులందు వెసవాయుజుడున్.

## రావణుని వైభవమునకు హనుమంతుడాశ్చర్యపడ

గీ॥ అసురకన్యలు రాజకన్యలును నాగ
కన్యలారావణునిగోరి కౌతుకమున
వలచివరియించి మన్మధవశులనగుచు
చెట్టబట్టిరి సుఖములాశించి సరగ

గీ॥ కొణచేబూనియొకసతి వివశయగుచు
నొఱగిశయనింప నందువేరొక్కకాంత
సవతితొడతలగడగా పసందుమీర
నలసినిద్రించె సోయగమభినుతింప.

మానినులాప్రదేశమున మద్యముద్రావుటచే మదంబునన్
మేనులెఱుంగకన్ ప్రియునిమీఁదిప్రియంబున తోటికాంతలన్
జానుగకౌఁగిలించుకొని సౌఖ్యకరంబుగ నిద్రవోవ న
వ్వానరపుంగవుండు చెలువంబున జూచెను జానకింగనన్.

| లతలవనంబువోలె కమలంబులగూర్చినమాలరీతి న
య్యతివలు నొండొరుల్ బరవశాత్ములు
నిర్భయులై యథేచ్ఛ న
మ్మతిఁదొడలన్ భుజంబులను
మస్తకముల్ పదముల్ కరంబులన్.
ధృతిని కవుంగలించుకొని
యింపుననిద్రనుబెందఁజూచుచున్.

ం| రమణులకుచహారంబుల
రమణీయకజఘనతల విరాజిత సుభ్రూ
కమనీయత గమనించుచు
ప్రమదంబున దలచె వానరశ్రేష్ఠుఁడిదన్.

ఉ|| కలదేయింద్రునకైన రావణునిభోగంబెంచఁ దేజంబునన్
జలజాప్తున్నిరసించు సీనికెనయౌ శౌర్యోజ్జ్వలుండొక్కఁడుం
గలడే నిక్కముగా ద్రివిష్టపమునన్ గాలించినన్ ధీగుణా
కలితుండేయగుగాక యన్యవనితాకాంక్షన్ విసర్జించుచో

గీ|| లంకసుదివంబుతోడ బోల్పంగవచ్చు
రావణుఁబోల్పనగు సురప్రభునితోడ
పరసతీవాంఛలేకున్న పరగనితడు
త్రిభువనంబులపాలించు దీప్తినొప్పు.

గీ॥ వీనికై ప్రాణములనిచ్చు వీరవరులు
కలరులక్షలు కోట్లు లంకాపురమున
వీనివై భవమేమని వినుతిసేయ
వచ్చు భోగీంద్రుడైన వహ్వా గణింప.

కం॥ రావణునిమీాదికూరిమి నావెలదులు
వలచివచ్చిరటు సౌందర్య
శ్రీవైభవసముపేతులు
నై _ వెలయుటమదిదలంప నాశ్చర్యముగున్.

కం. సురవిభుశయనగృహంబును
నిరసింపందగిన రామణీయకతన్ సుం
దరమగుశయనగృహంబును
పరికించెన్ రావణాఖ్య భవనంబందున్.

గీ. స్ఫటిక వైడూర్యమణులతో స్వర్ణమునను
దంతములచేయబడిన రత్నములకాంతి
నొప్పు పీఠంబులనుగల్గి నుత్తమంపు
గృహమునానొప్పుచుండె నాగృహములెస్స.

మ. ధవళచ్ఛత్రము చంద్రబింబపు
సముద్యత్కాంతిరాజించి _ నూ
త్న వికాసంబునుగూర్ప
నాశయనసౌధంబందు తల్పంబునన్
రవికాంతింబురుడించు రత్నములహారంబుల్ ప్రకాశింప నా
సవుపోలెన్ శయనించు రావణుని
నాశ్చర్యంబునన్ జూచుచున్.

మ. హనుమంతుండుదలంచె
నెమ్మనమునందారావణుంగూర్చి యి
ద్దనుజాధీశుని విక్రమంబునకు పాతాళంబు నాకంబునీ
జనలోకంబు శిరంబువంచెననినన్ సత్యంబుగానెంతు నిం
ద్రుని బంధించిన వీనిసాహసము
కీర్త్యుత్సాహముల్ దక్కువే.

కం. అని రావణునిముఖంబున
దనముఖముంబెట్టిజూచి తత్తరపడి యి
ట్లనిఁదలచె దనమనంబున
దనుజుడుగుర్తించెనేనిఁ దగమోసపుగున్

గీ. నృత్తవాద్యములందున నేర్పుగలిగి
సుందరాస్యులు సుమనోజ్ఞశోభ నొప్పు
రావణునికాంతలనుఁజూచెరాముబంటు
రావణుని పాదములచెంత వ్రాలిసోల

గీ. వజ్రవైడూర్య రత్నప్రవాళ కాంచ
నాభరణముల ధరియించి యప్సరసల
సరకుసేయని రావణసతులజూచి
జానకినిఁజూడకున్కి విచారమొందె

కం. రమణీయంబగు కుచములఁ
దమిప్రియునింకౌగిలించుఁ దరళాక్షివలెన్
ప్రమదామణి పటుహంబును
సప్రమదంబునకౌగిలించి పవళించెనటున్.

గీ. కనులలోచని కొంచుని కాంచిపేర
నక్కునంజేర్చుకొను రీతి నవ్యముదమున
గ్రుచ్చుకొను కోర్కెనిఁజేర్చి వివశయగుచు
నటునిద్రింపఁజూచె వాతాత్మజుండు

## హనుమంతుడు మండోదరిని జూచి సీతయని భ్రమించుట

సీ. ఈ మేనికాంతి సౌధమునఁ బ్రకాశించి
బంగారువన్నెల ప్రభలనీన
సౌందర్యమున నామె సాటి లేదనిపించు
దనమున రంభాదిదేవులు లడల
నాగపురస్త్రీల కాసోయగమునాస్తి
యని రసజ్ఞులు మెచ్చి యభినుతింప
సురగానవోజ్జ్వల విభ్రమానందదీప్తికి
నాలంబనియామె తనువుజాటు

గీ. రావణునకిష్టురాలు పురంధ్రిచయము
నందు పూజింపదగిన మహాత్మురాలు
నైన మండోదరిని రావణాంతికంబు
నందు సవరించఁజూచె నయ్యనిలజుండు

కం. ఈమెనలకి సౌందర్యము క్షితినెచ్చటనేనిగలదె చెలువంబున సు
ష్వు సురభామినులైనను
పై పాదులింతపొల్కె దీనిగనినచో

చం. అని హనుమంతుడాత్మను
ప్రియంబున మెచ్చుచు సీతనామసం
బునఁజలపోసి వెండిదనబుద్ధికి
నెంతయుసిగ్గుజెంది మా
జనకజ సాధ్వి పుణ్యసతి
సద్గుణవర్తన రాముపీడి యీ
దనుజునితల్పమందు
సముద్రంబునవివ్విధి పవ్వళించునే

కం. పరపురుషునింద్రైనను పరికింపనిసాధ్వి
నియమపారీణయు స
చ్చరితయగు సీత రావణు
పరసనుశయనించునొక్కొ సత్యముదలపన్

గీ. కానసీమె మండోదరిగా దలంతు
మయునిపుత్రిక దనుజేంద్రుమగువ దలప
నీమె సౌందర్యమున రంభనేనిగెలచు
మదిద. రూపాలఁ దాఁపియు మంచిదగునె

గీ॥ మైథిలినిజూడ నామీదమారుతియటు
పానశాలనుశోధించి పట్టుదలను
నాయుధాగారమందు నుద్యానవనము
నందు చిత్రశాలనుగాంచె నతిరయమున

చం॥ తిరిగి లతానికుంజముల దేవగృహంబుల రాక్షసాళిమం
దిరముల దీక్షతోవెదకి ధీరచరిత్రను జానకిన్దయా
కరుడగు వాయునందనుడు గానగలేక విషాదవర్తియై
వరణమునెక్కి దీనదశ వందురి నెమ్మిదలంచు నిట్టులన్.

కం. చూచితిదేవాలయముల
చూచితిసౌధంబులెల్ల సుందరవనముల్
జూచితి రావణునింటిని
చూచితి మారాముసతిని చూడగనైతిన్

చం॥ వడి శతయోజనవనాయతపువార్థిని దాటి నిశాచరుల్ మఱి
దడబడ సింహికన్దునిమి దానవనాథుపురంబుచొచ్చి నే
ర్పడగమనింపవ్యర్థమని భావమునందుదలంతు నింక నే
వడువున సిగ్గులేక రఘువంశలాముని చెంతకేగుదున్

చం॥ రవిజుడునిర్ణయించిన భరంబగుమేరయతిక్రమింప నే
నవనిజఁజూచివచ్చెద భయంపడనేటికి మేలగున్ రఘు
ప్రవరునకంచుజెప్పి సులభంబుగవార్ధినిదాటివచ్చి యే
నవనిజగాననైతి కపులందర కేమని విన్నపించెదన్

సీ॥ చెప్పె సంపాతిలంకలో సీత భర్తకొఱకు
దవమనమందున గుములుచుండె
నని యసత్యమో సత్యమో యదిగణింప
నేమిచేయుదు నింకనాకేదిదారి

క॥ జనకజనుజూచుకొఱకై వనితలనతిశ్రద్ధజూచి వైదేహిని నే
గనజాలనైతి నకటా వనటన్
గుములంగ వలసె వర్ణినిగానన్.

సీ. నతులముఖమున ముఖమునెంచంగబెట్టి
నిపుణతన్జూచితిని కమనీయముగను
బ్రహ్మచారిని నతులనిప్పగిదిజూడ
భావ్యమే నిందునేదను మహాపాతకుడను

కం॥ పరకాంతల నత్తిశ్రద్ధంబరికించితి
సీతయనుచు పరవశమొదవం
ధరణింబడిశయసింపగ దురితమునాకొదవె
దుర్మతుడ నింకెట్లో

గీ॥ రావణాంతఃపురస్త్రీల రాక్షసాంగనల
వివస్త్రల మద్యపానవివశలను
సీతగానెంచిజూచితి సిగ్గులేక
పాపమంటుదెనాకు నేర్పడ దలంప

ఉ॥ పాతకుడన్ పరాంగనలబాగుగజూచి గణింపనిట్లు ని
ర్భీతిని సంచరించియొనరించినపాపము నెట్లువాయు దు
ర్నీతిపరుండనంచు గమనింపగ లోకముదిట్టుకున్నె మా
సీతనెఱుంగనైతి పరిశీలన నిందలకొగ్గితింగటా

కం॥ హనుమంతుడిట్లు మదిలోననుతాపమునొంది
మీద నాపై దెలివిన్
గాని యిట్లునిశ్చయించెను
దనుజేంద్రునికాంతలందు ధరణిజనుగనన్

కం॥ పరికించినాడ గావున
దురితంబెట్లంటునాకు తోయజగంధిన్
ధరణీతనయనుజూడగ
తరుణులలో వెదకు టెంచ దగు నీరీతిన్

కం॥ తరుణీరత్నమను సీతను
తరుణులుగలచెసనుగాక దగునే వెదకన్
పురుషులలోనగణింపగ-
దురితమునాకెట్టులొదవు దూష్యంబగునే

కం॥ పాపమునకైన పుణ్యవ్యాపారంబునకునైన నగునుమనంబే
నోపుంగా నిటనామది నేపాపాన క్తిదగుల కెంతయునొప్పు,

గీ॥ కాన రావణుకాంతల కమ్ముఖుల
ర క్తిఁజూచితి సీతకొ అకు నిజంబు
పరగకామేచ్ఛ మోహవిభ్రాంతిగాదు
పాపమిందిట్లునన్ను నేర్పడగలంచు

చం॥ అని హనుమంతుడెంచి హరిణుక్షి మహీజనుగాంచనైతి నం
చును మదిఖేదమొంది యిటుజూచితి
నొక్కగృహంబునేని, రం
జనవిడనాడకుండ బురిసర్వము తోటల పానశాలలన్
వనితలునుండుచోటుల ధ్రువంబుగ
సీతనెఱుంగు వాంఛతోన్

కం॥ నావెదకని గృహమిప్పురి
లో వెదకిన లేదు గాన లోపము నాయం
దేవిధి గాన్పింపదు గద
నేవెరవున సీతనింక నెఱుగుదునకటా

మ॥ దురితాత్ముండగు రావణుండు
బలవంతుడౌచు వైదేహిం త
స్కరవృత్తింగొనివచ్చువేళ దనుపున్ గంపింపగాభీతి జె
చ్చెరవార్ధింబడెనో ధపుండుకరుణాశీలుండు నారాముబి
గ్గరదా పేర్కొని పిల్చుచుఁ దెగియెనో గాకేమి వేరున్నదే

కం॥ పాపాత్ములైన రాక్షసులాపడతిందినిరో
లేక ససురవిభుండే
కోపంబునఖండించెనో కాపత్యంబొదవె
నెట్లు కలుగుశుభంబుల్.

ఉ॥ సీతనుజూడకేను రఘుసింహునిచెంతకుపోదునేని సం
ప్రీతి రఘూద్వహుండు
మురిపెంబునుజెందుచు కౌగిలించి నా
నాతినిజూచితే దనుజనాధుపురంబునఁజెప్పుమన్న
రీతి నదుత్తరంబిడెద అిచ్చవడన్ దలవంచిసిల్తునే

గీ॥ రామ సీతనులంకాపురంబునందు
వెదకి జూడనై తిననిన పీరుడైన
రాఘవుడు గుండెవగిలి స్వర్గస్థుడగును
లక్ష్మణుడు నన్నకేడ్చి యిలన్ ద్యజించు.

గీ॥ రామలక్ష్మణులీరీతి ప్రాణములను
విడువ సద్భక్తి తాపసివేసమూని
నన్నకైయేడ్చు భరతుడెట్లువన్బ్రతుకు
నతనివెంటనె శత్రుఘ్నుడరుగు దివికి

కం॥ తమసుతుల మరణవార్తను
క్రమమునవిని జూచి వగచి కౌసల్యయు దుః
ఖమునంజచ్చు సుమిత్రయు
నమరపురింజేరు కైకయాపైజచ్చున్

ఆ॥వె॥ రాముకొఱకునేడ్చి రవిజుడుమరణించు
వినజువెంట రుమయునేగు దివికి
నంత తారజచ్చు నంగదుడుండెగు
కపులుమీాద జావగలరు నిజము

కం॥ ఇంతయరిష్టను రాముని
కాంతను పరికింపకేను కడువడి సుగుణ
స్వాంతుండగు శ్రీరాముని
చెంతకుజననొదవు గాన చింతింపవలెన్

గీ॥ సీతజాడనెఱుంగక సిగ్గుమాలి
యిప్పుడేను కిష్కింధకు నేగుదేని
కడిమి నిక్ష్వాకువంశము కపికులంబుఁ
జెగుటనిస్సంశయంబు మదిందలంప

కం॥ భూమిజనుచూడ కెవ్విధి
రామునికడకెట్లువోదు రంజిలు మోనం
బే మహి నేవోకుండిన
నామహితుడుగోరునాదు యాగమనంబున్

కం॥ దొరికిన ఫలములమేసవుచు
పరగన్ స్వార్థంబుగీడి పరమాత్ముని శం
కరునిభజించెదనిష్ఠన్
పరమానందంబు మోక్షపథములభింపన్

శా॥ భక్తిన్ ఘోరదపంబుసేయుచునిటన్ ప్రాయోపవేశంబు నా
సక్తింబూని శరీరమునివిడచుటే సమ్మానితంబౌ నిలన్
శక్తిన్ రావణుబట్టిజంపనగు నాశౌర్యంబుదీపింప సౌ
మ్యోక్తుల్ దబ్బఱమాట లేల
దురితాత్మున్‌బిట్టు బాధించుచున్

శ్రీరామునిసన్నిధికిఁ
దీసులువినుతింప సమ్మతింగొనిపోపం
గా రవిపుత్రుడుమోదం
బారయ దశకంఠునొగిని సవమానించున్

వాలివలె నేనురావణు
వాలంబునకట్టి ఠీవి వారిధులందున్
లీలన్ముంచుచు తేల్చుచు
తెలికగొనిపోదు కపుల ధృతిననువొగడన్

సీతను దర్శించుటకై
పాతాళముజొత్తు దివినిపరిశోధింతున్ భూతలమెల్లనుదిరిగెద
భీతిన్ సురలార్వ నింద్రుపిచమడంతున్

అని దలచుచు హనుమంతుడు
జనకజసేమంబు నెఱుగజాలక దుఃఖం
బునగుంది వెండియోచిం
చెను మనముః శోకయుతుని చెందువిపత్తుల్

అగ్నికుండమునందు హోమార్ధమరయ
యజ్ఞపశువును గొనిపోవు నట్టులేను
రావణునిబల్మిబట్టి శ్రీరాముకడకు
నేగెదనుగాక వానరులెల్లరు బొగడ

రక్కసులజంపి లంకాపురంబు పెల్ల
గించి వార్ధినిగలిపెద కీర్తినెనయ
బలియుడు దశాననునిజంపి
ప్రాణములనువిడిచెదనునేను నిచటనే విమలబుద్ధి

గీ॥ కలదు దశకంఠునకు నశోకావనంబు
నదియు గమనింప నందనోద్యానమునకు
సాటియనిజెప్ప వింటి నచ్చటకునేను
వేగమునవోయి సీతను వెదకువాడ

ఉ॥ శ్యామయు తన్వి చంద్రముఖి సాధ్వి సరోరుహగాత్ర
స్త్రీమ కురంగలోచనయు సుందరి పాండురదంతపంక్తి
దామినినానెసంగు నుచితంబగువిగ్రహపుష్టినొప్పు మా
రామునిభార్య నెప్పుడుఁదిరంబుగ
జూచిముదంబునొందెదన్

గీ॥ దశరథునిముద్దుకోడలు ధర్మపృగయ
సుగుణఖనియైనజానకిం జూచుకొఱకు
వేయిమార్లైన లంకలో వెదకువాఁడ
ధైర్యమునువీడనేల మోదంబెసంగు

కం॥ అనిమనమున నిర్ణించుచు
హనుమంతుడు నంతప్రాగ్దిశాభిముఖుఁడై
దనకరములజోడించుచు
ననిమిషులన్మేలుగోరి నాత్మ నుతించెన్.

సీ॥ సృష్టికర్తవిరించి చేకూర్చుశుభములు
కూర్మి శంభుఁడు మేలుగూర్చు నాకు
సూర్యచంద్రాదులు శోభనంబులొసంగ
నింద్రుడు భద్రములిచ్చి ప్రోచు
యమపవనాగ్నులు సరసిరక్షింతురు
సీతకుమ్రొక్కి సచ్ఛీలురైన
రామలక్ష్మణులను ప్రార్థించి
సుగ్రీవునకు నంజలించి యానందమొదవ

గీ॥ కడిమి నేగెద నేనశోకావనంబు
నందుసీతనుదర్శింప ననుచు శక్తి
వాయుపుత్రుడు తీవిజవంబులెసగ
జనె నశోకావనంబుగాంచగ యథేచ్ఛ

కం॥ పెక్కింద్రుడువిక్రమాడ్యులు
రక్కసులావనముగావ రక్షితమై పెం
పెక్కినతరువులతో నది.
జక్కవ నలరారుచుండ సామీరిగనెన్

తె॥ పరగ నవ్వనంపు ప్రాకారమునుజేరి
సూక్ష్మరూపమూని సుగుణవంతు
డైనపవనజుండు నవ్వనంబ నుజూచి
మదినిమోదమంచె మానితమున

ఉ॥ పక్షులచేధ్వనించుచు నభంబునుదాకుచు నున్నతంబులౌ
వృక్షములన్ సువర్ణమున వెండినిజేసినరీతి కాంతిప్ర
త్యక్షముగాగ జూచుచు ముదంబునపూలను నేలరాల్చుచున్
వృక్షములన్గదల్చె కపివీరుడు మారుతునట్లనుద్ధతిన్

తె॥ విరులుమేనుగప్ప విలసిల్లెపావని
పూలకొండరీతి పొలుపుమీరి
యంబరమున నిలచి యమరులు సామీరి
నభినుతింప హర్షమతని ముంప

గీ॥ వెండిజేకుల స్వర్ణంపువేదికలను
నొప్పు జలపుల స్వచ్ఛమౌయుదకములను
గలిగినసరోవరంబుబు కాంచనమున
రత్నసోపానములదగి రంజిలంగ.

కం॥ తరుణాంకురపల్లవముల్
విరివిడి పుష్పించినట్టి విరుల మనోజ్ఞం
బొరయగ నున్నతమైదగు
నిహగుడుచెట్టెక్కి కపికులేంద్రుడు జూడన్

గీ॥ అయ్యశోకాతతులకాంతి యగ్నివోలె
మండుచున్నవిధంబున మహితదీప్తి
నొప్ప కపికుంజరుడుమది నొగిదలంచెఁ
జూచెదనుగాక సీతనిచ్చోట నేను

కం॥ శ్రీరామదర్శనంబును
గోరుచు దుఃఖముననొచ్చి కురరివిధమునన్
హారామ! వల్లభాయని
యీరమ్యోద్యానమందు నెల్లందిరుగన్

శా॥ హానాథా ప్రియవల్లభా రఘువరా యానందసంధాయక
నేనీదానను మోసపోయితికటా నిన్నెంచ దైతేయసం
తానారణ్యదవానలుండవుగదా దైత్యాళినింగాల్చి స
న్మానింపందగు భార్యనంచువగవన్
మాతల్లినింజూచెదన్

కం॥ అనికైలాసనిభంబగు, ఘనమగుప్రాసాదమెక్కి కపికుంజరుఁ
తను జూచి యొక్కవనితను
గనుగొనె నొకచెట్టుక్రింద గంభీరమతిన్.

## హనుమంతుడు సీతను జూచుట

౨॥ ఉపవాసములజిక్కి యోగీశు కృపక్షాది
చంద్రరేఖనుబోలి సౌరుదక్కి
రాక్షసస్త్రీలు నిరంతరంబునుగావ
మలినవస్త్రాంగియై మరియుదీన
మతిని నిట్టూర్పులు మాటిమాటికి
నధికంబుగా సేయలంకారములను
సేయక ధూమముచేగప్పబడినట్టి
వీతిహోత్రజ్వాల విధమునొప్పి

౩॥ కుముదములు పద్మములేని
కొలనురీతి నేత్రములజాలువారు కన్నీటితోడ
నిరశనావ్రత కృశయునై నీలవేణియైన
సతినొకదాని నాహనుమగాంచె

౨॥ స్వగణములబాసి యొంటరి
శ్వగణంబులుబారిసమర వాచఅవిమదిన
బొగిలెడిమృగమన రాక్షస
మగువలునదలింప నడలు మానినిగనియెన్

౩॥ జఘనతలమునవ్రాలి
సంస్కారహీనమైనసతికేశపాశము నరయ నీల
కాంతికృష్ణసర్పమనంగ కడుమనోజ్ఞమగుచునర్తింప
మిగులదుఃఖార్తయగుచు

గీ॥ తనువునం జీర్ణ పీతవస్త్రమును
గట్టి, భాస్కరోదయమునుగోరు పద్మమనగ
భర్తృదర్శనకాంక్షయై బాధనొందు
తరుణినొకదాని వాయునందనుడు జూచె.

ఉ॥ ఆవనితన్ మహాత్ముడు బలాఢ్యుడు
నైజసమీరజుండు – స
ద్భావనజూచి భావమున పావనబుద్ధిదలంచెనిట్లు నా
కీవనబేక్షణంగనిన నెంతయు మోదమువృద్ధిజెందు. సౌ
ఖ్యావహమయ్యె సీతయగునంచుదలంచెద నీపతివ్రతన్

సీ॥ పూర్ణచంద్రానన పుణ్యస్వరూపిణి
యమలాంగి పక్వబింబాధరోష్ఠి
సుందరమధ్యయు శ్రోణీభరాలసగమనయు
సురవన కంబుకంఠి
నీలవేణియు కమనీయచరిత్రయు
సుస్నిగ్ధవృత్తపయోధరాఢ్య
సుభ్రూవిరాజిత సుమధురభాషిణి
రతివలె చారునేత్రములనొప్పి

గీ॥ తాపసాంగనవిధమున ధవునిగూర్చి
తపముసేయుచు చిక్కినతనువుగలిగి
పొగనుగప్పిన వహ్నినాపోలుపుదక్కి
బాధవడునీమె రామునిపడతి యగును.

కం॥ దనుజేంద్రుడెంచ బలిమిన్
గొనివచ్చెడు వేళ కట్టుకొన్నవలువ నే
గనుగొనమెయినిధరించెను
యనుమానంబేల సీతయగునీసతియున్

గీ॥ ఋశ్యమూకాద్రి సుగ్రీవునేము
తొల్లి రావణుడుగొనిపోవ కురరివిధమున
నంగలార్చగజూచిన యంబుజాస్య
యీమెయేయంచునెఱిగితి నింపెసంగ

ఉ॥ అని హనుమంతుడంత జనకాత్మజ రామునిపత్నియైన సీ
తనుకనులారజూచి ప్రమదంబున నాత్మదలంచెనిట్లు-ధీ
వినుత యశోవిలాసిని పవిత్రగుణాఢ్యయు నిర్మలాంగి యీ
వనితవియోగమెట్లు గుణవంతుడు
రాముడు సైచెనక్కటా

సీ॥ రాము(డుతొల్లి యీరమణికోసమెగదా
తాకినిశిక్షించె గర్వమడగ
సీతన్వికోసమే యేచివిరాధుని
పరిమార్చె నమరులుప్రస్తుతింప
నీమెనిమిత్తమే యెదిరించిపైబడ్డ
ఖరదూషణాది రాక్షసులదునిమె
నీచానకొఱకు కపీంద్రుడౌవాలిని
వ్రేటునగూల్చి సుగ్రీవునేలె

గీ॥ సాధ్వి జగదేకపావని సరసిజాక్షి
యీమెనరయగ వానరులెల్ల దెసల
కరుగనాజేసినట్టి పుణ్యంబుకతన
చూచితిని సీతనేడు నిచ్చోటనేను

కం॥ రామునికో అకీ మైథిలి భూమిజకై రాముడిలను బుట్టిరి నేడీ
లేమనుబాసి రఘూత్తముఁ
డీమెయిజీవించుచుండె నెఱుగవశంబే

గీ॥ ధర్మపత్ని యర్ధాంగి సుందరియునైన
రమణి నీమెనుబాసి మారాముడకట
మన్మథునితీవ్రశరములు మదినినాటు
నటుమటించుచునుండె నీయతివకొఅకు

కం॥ రామునకు ముజ్జగంబులు
నీమహినిలభించుకంటె నెన్నో మడుగుల్
భూమిజహెచ్చు దలంపగ
రామునకీ సీతగలుగ రాజ్యంబేలా

చం. ధనము సమస్తభోగములెదన్ గమనింపక భర్తవెంటఁదా
వనముల కందమూలముల
వాంఛభుజించుచు తృప్తినుండ ని
ద్దనుజునిబారిజిక్కి కడుదైన్యమతిన్ విలపించుచుండె లం
కను-బలవత్తరంబుగదకర్మము వేరికినైన నిబ్బువిన్

కం॥ పతియేభూషణమగుగద
సతులకు—పతిచెంతలేని సాధ్విగణింపన్
క్షితి తేజోవతియయ్యును
నతిదీనత మలినభావమై యొప్పుజుమీ

సీ॥ అంగారక గ్రహ మరయికపీడింప
వెతనొందురోహిణి విధమునొప్పి
నాగకన్యకవోలె నవసినిట్టూర్పులు
నిగుడ మనోధవునిం దలంచి
మాటిమాటికి దుఃఖమగ్న మానసయునై
శోకమేస్త్రీత్వము చొప్పరించు
రీతి గణింపనిర్వేదించు
నీసాధ్వికెనయగుసతులు లేరెందుఁదలప

గీ॥ నీమెకివ్విధి దుర్దశనేకరణిని
కరుణమాలివిధించె పంకజభవుండు
నిన్నికష్టంబులకు మూలమెంచకైక
దైవగతిమీద నేమనదగునెవరిని

చం॥ అతిధృతివార్ధిదాటి యురగాంబికమెప్పునుబొంది సింహికన్
స్తుతమతిజంపి లంకిణియశోధనమెల్లనుకొల్లగొట్టి యు
ద్ధతి బలగర్వధుర్యులగుదైత్యుల సౌధముల్లెల్లరోయుటీ
క్షితిజకునైగదా యిచటసీతనుజూచితి
మోదమందితిన్

గీ॥ శక్తి లంఘించి నూఱుయోజనములొప్ప
జలధివడిదాటి లంకకుఁజని రయమున
జానకినిజూచివచ్చెద సత్యమేను
ననివచించితి నదియు కృతార్థమయ్యె

గీ॥ జాగరూకత రామలక్ష్మణులుఁగావ
నొప్పునీసాధ్వి రక్కసులుగ్రవదను
లగుచు బెదరింప మదినిభయంబునొంది
వణకుచున్గూరెడుఁగా వలవంతలోర

గీ॥ తగదుభాషింప నిప్పుడీమగువతోడ
పంకజసఖుండు నుదయించి క్రుంకుదాక
సైచి యామీదరాత్రి యథోచితముగ
మాటలాడెద నీమెతో పాటవమున

కం॥ అని యల్పగాత్రుడగుచుఁ
హనుమంతుడు చెట్టుకొమ్మలందున నాకుల్
దనమేనుగప్ప నొదుగుచు
వినమితుడైయుండఁ దమము వెలవెలబారెన్

శా॥ వీణా వేణుమృదంగ వాద్యములు
నుర్వీదేవతల్ వేదముల్
రాణన్‌ మ్రోయుచు రావణాంతికముననర్రంజిల్ల నామీద వి
న్నాణంబొప్ప దివాచరంబులు దివానాథున్ ప్రశంసింప న
క్షీణానందమెనంగుభంగి మహి పక్షిప్రాతములే కూయుగఁ

కం॥ కుముదములుఖేద మొందగ
కమలమ్ములుమోదమొందగా దిక్పతినం
భ్రమమొందగ నుదయాద్రిన్
కమలాప్తుడుబొడమి కాంతి ఖరకరుడగుచుఁ

గీ॥ పగలుశ్రమియించి బడలికబాపుకొనగ
నింటికింజనునోయన నినుఁడునంత
క్రుంకెనస్తాద్రిఁ దమముదిక్కులనునిండి
స్వేచ్ఛగాసంచరింప నిశీథినంత

కం॥ దనుజాధిపుడవ్వేళను
మనసిజశరతప్తహృదయమున్గుండై యా
జనకజనెగ నూహించుచు
తనమనమున నడచుకొనుచు తాపము సమతన్

కం॥ సర్వాభరణంబులమెయి
గర్వోద్ధతిదాల్చి మణి కాంతులు విరియన్
ధూర్వహుడగు దశకంఠుడు
నుర్విజనుజూచుకాంక్ష నుదయింపమదిన్

గీ॥ దేవ గంధర్వ రాక్షసస్త్రీలు వెంట
గొలిచిరా పక్కతరుల నుక్కున బెలంగి
బహువిధంబులగు పుష్పములతోడ
పక్షులనుగూడి యానందభరితమగుచు

ఆ॥వె॥ స్వర్ణరౌప్యమణుల సాలంకృతంబు
విశాలమైన ద్వారవయముగలిగి
సుందరంబునౌ యశోకావనంబును
జొచ్చె జనకసుతనుజూచుకొఱకు

కం॥ దేవేంద్రునతిమురంబున
సేవించెడియప్సరసల చెలువున పంక్తి
గ్రీవుని నూర్గురుపడతులు
వావిరిపూజింపవడలె వైయాత్మమునన్.

ఆ॥వె॥ చెఱకువిల్లువిడచి చెంగుస్ప్రపత్యక్ష
మైన మదనునట్లు నసుగపిపడు
కాంతలెల్ల గొలువ కాంతి
యశోకావనంబుజొచ్చె వారణంబు పగిది.

మ॥ బలగర్వంబున ముజ్జగంబుల
యశఃప్రావీణ్యమేపార ను
జ్జ్వలతేజంబుననొప్పు రావణునిసత్సౌందర్యసౌభాగ్య కో
మలగాత్రాన్వితలై నవాసిసతులన్
మాణిక్యదీపంపుకాం
తులగాంచెన్ పవమాననందనుడు నస్తోక ప్రభాదీధితిన్

గీ. రావణునిజూచుకోర్కెనా రామదూత.
క్రిందికొమ్మకుదిగిజూచి కేరుచుమది
సీతడే రావణుండగు నించుకేని
సందియములేదునానెంచ సత్యమనుచు

కం॥ తేజస్వంతుడు వాయుత
నూజుడు విభవోన్నతుండునున్ ధీరుండన్.
స్త్రీజనమానసచోరుడు
రాజితబలదర్పవిభవు రావణునిగనెన్

ఉ॥ అంతటురావణుండు సతులందరుసమ్మతివెంటునంటు న
త్యంతమనోహరాకృతి సుధాకరబింబనిభంబునౌ ముఖం
బెంతయుకాంతినొప్ప భువినీలగవచ్చిన పద్మపోటికన్
శాంతినెసంగు సీతను భృశంబగుకోరిక జూడవచ్చినన్

గీ॥ రావణునిదూరమునజూచి రామపత్ని
గాలిదాకున దూలెడి కదళివోలె
భీతిగడగడవణకుచు పెందొడలను,
కడుపుభుజముల కుచముగ ప్రకొనియె.

సీ॥ రాక్ష॰ స్త్రీలచే రక్షింపబడినదై
యతిదుఃఖమున వివశాత్మయగుచు
తీక్ష్ణంబైన పాతివ్రత్యనియమంబు
పాటించు సద్గుణాభరణియుంగ
క్షోణియాసనముగా శోభింప
పంకదిగ్ధమగు మృణాళిచందమునఁదనరి
శుష్కించునదివోలె శూరుడౌ ధవునిచే
రిపుడీల్గ్లక్షమనుధరించి యిష్ట

గీ॥ దైవమునుగూర్చి మ్రొక్కువిధంబుఁదోప
పరగణేమోద్భృగగ్ని జూపట్టునట్లు
పెనిమిటిం బాసి మిగులఁదపించునట్టి
రమణిఁ జెంతకునేతెంచె రావణుండు

మ॥ పతిరూపంబుసదామదిన్నిలుపుచున్
భారంపునిట్టూర్పులన్
ధృతిగోల్పోయి కృశించిదైన్యమున
పాతివ్రత్యమే స్త్రీత్వమున్
క్షితినెంచంగ ధరించెనో యనఁగ
వాసిందప్పి శోకించు నా
సతినింజూచి దశాననుండు వలికెన్
సామోక్తులన్ గూరిమిన్

## సీతారావణ సంభాషణము

ఉ॥ ఎందులకిట్లు భీతహరిణేక్షణ! భయంబు నొంద నా
యందు భవన్మనంబును బ్రియంబుననిల్పి సుభోగభాగ్యవై
త్రిందగనేలుకొమ్ము సుమతిన్
నిను భక్తి భజించువాడ నా
చందము నీవెఱుంగవు నిజంబు గ భృత్యుడ నీకు సుందరీ

కం॥ నాయందు నమ్మకమునిడి
శ్రేయంబగు మార్గమీవు శీఘ్రముగా నా
కోయతివా జూపింపుము
కాయజగర్వాపహార కలితవు సగుణున్

కం॥ తలదువ్వుకొనక వెంట్రుకలనొక జడగా గట్టు
నింతి యిటులన్
మలినాంబరముం దాలిచి
దలపగ మహిబవ్వళింప దగవే చెప్పమా

కం॥ సకలలంకారాజ్యము
సకల భక్త భృత్యవరుల సైన్యంబులన్
సకలోరన భోగములన్
ప్రాకటమతి నిత్తు దయను పరికించిననన్

కం॥ లలితాంగి రక్తి నిమ్మహిగల సిద్ధ ప్రజ్ఞానులున్
సుకీర్తియుతుడనౌ
లలి జనకున కర్పించెద
కలతంబడనేల నన్ను కరుణింపు గదన్

కం॥ నినుకూర్మిన్ సృష్టించిన
వనజాసనుడైనమగుడ వనితానినుజూ
చినవాంఛబల్మిఁగూడక,
మనునేపలుమాటలేల మగువాపలుకన్

శా॥ సౌందర్యమ్మున యౌవనమ్మున
విలాసమ్మందు నీసాటిని
స్పందేహమ్ముగ ముజ్జగమ్ములను
నోచంద్రాస్యగాలించి నే
నెందున్ నిక్కముగాంచనైతి
కరుణన్ హేవాకమింపొంద నా
నందంబిమ్ము రతిప్రమోదయుతవై
నాప్రేమమన్నించుచున్

సీ॥ సురదనయున్ మనోహరము
సుందరమౌ భ్రుకుటిన్ మనోజ్ఞమౌ
సురుచిరచంద్రబింబమన శోభనొనంగెడి నీదుమోమునన్
చ్చెరువగు సుందరాంగులనిఁ
జెప్పెడివారలు నిన్నుజూచుచో
శిరమునువంచి సిగ్గుపడిచేతులుమోడ్చి
నమస్కరింపరే

సీ॥ ధనపతినింజయించి సముద్రముభుసం దెచ్చిన
రత్నముల్ మునం
బునగొని కాముకేళిసి సుబుద్ధిస[illegible] గూర్చినా కు నా
వనితలు నిన్నుశక్తిగొలువన
పరిచారికలెల్ల నీయును
[illegible] భోగముల
చం[illegible]నుబీ యలరారుమింపునన్

క౦॥ నాకగ్రగమహిమపివగుచున్
నాకాంతలునీదు పంపునంజరియింపన్
ప్రాకటముగనారాజ్యము
చేకొని ననునేలుకొమ్ము చెలువా రక్తిన్

చం॥ శతముఖుడాదిదిక్పతుల సాహసవృత్తిజయించి వెండి భూ
పతుల రసాతలాధిపుల భాగ్యములెల్లహరించి ధీబలా
న్వితుడని యెల్లవారలుపవిత్రమతిఁ భజియింపనొప్పునా
యతులితతేజముంగని ప్రియంబున
నన్నువరింపుమో చెలీ

క౦॥ విగతాంభరణవునగుచున్
వగవంగానేల నీకువచ్చినవానిన్
సుగుణమణిగొనుమిచ్చెద
నగణితసౌఖ్యములనాకు నర్పించుటకై

మ॥ ధనహీనుండును రాజ్యహీనుడు
సమర్థత్వమ్ములేనట్టి పే
దనరున్ రాముని నీమనంబుననమంద ప్రీతి నర్చింప యౌ
వనమేరీతిని సార్థకంబగును-దివ్యశ్రేణిచేపూజలం
గొనుసిర్వ్యక్రపరాక్రముండనగునన్
గూర్మిన్ప్రశంసింపుమా.

గీ॥ కాలకేయాదిరాక్షసగణము
ననారశర్గనను శ శ్రీవ్రు సాహస మునగెలచి
తెచ్చినమణివ్రజంబు రక్తిననొంగి
నిన్ను సేవింతు నన్నునన్నింపువిరావ

చం॥ జనకుడు సోదరుండు పిరనంబున గెంటిన

రాజ్యహీనుడై

వనమున కందమూలముల వాసిభుజించుచు వల్కలంబులన్

తనువున దాల్చి కాంతిజెడి దైన్యమతిన్ విలపించునట్టి గా

మునినతిభక్తినిం గొలువ మోహిని

నీకగునే శుభంబులు॥

కం. బలమున నైశ్వర్యంబునఁ

దలపంగా తేజమందు దర్పమునందున్

లలనా సాటియె రాముడు

పలుకగదే రావణునకు భయపడ నేలా

వ॥ రమణీయంపు సముద్రతీరముల నారామంబులన్ దివ్యహా

రములన్ దాల్చి మనోహరాకృతిని

సారంభోర్వశులన్ సిగ్గుచేఁ

డమకీ రంబులు పంచి మొక్కగ

సముద్యత్ప్రీతి నాతోడ - సు

త్తమభోగంబుల మత్తకాశిని నీవో దంబొప్పక్రీడింపుమా

కం॥ దనుజులు బలవంతంబున

వనితల బోగెంపనట్టి పాడఁబేలా

నిన బలమిగాడవి యింపగి మనసొప్పదు నాకు

గూర్పమాసు క్షణవడిన్

మ॥ నను నీ దాదునిగా గ్రహించి యశమానందమ్ము జేకూర్చ, రం
జన నిన్ వేడెద. నాసతీసతులకాంక్షన్ నిన్ను సేవింపనో
వనితా నేనియమించెదన్
దయను నీ వాడన్ కటాక్షింపవమా
నిను పూజించెద నాసపర్యలను
మన్నింపంగను బ్రేముడిన్

కం॥ అని రావణుఁడీక్షితిని
జనకజ నదలింప శోకసంభ్రమము తయై
దనకరమున తృణకణమును
గొని మైథిలి ధవుని సుఖము గోరుచు మదిలో

కం॥ దీనంబైన స్వరంబున
మానిని మదిభీతిముంప మనికిత మెగయన్
జానకి గడగడ వణకుచు
దానవునిం జూడరోసి దగనిట్లనియెన్

కం. పాపిష్ఠుడెంచ మోక్షంబే పగిదింబడయ నేర్చు నిలసీవట్లే
చూపును నిల్పితివౌరా నాపయి ఫలమెట్టు
లొదవు నక్తంచరుడా!

మ. పరదారాగమనంబు పాపమనుచున్
భావింపవే నాడు దు
శ్చరితుండీవసహించిరెల్లరు
దురాచారుండవౌనీదు దు
ష్కరమౌదుష్కృతముల్
భవత్పురమునన్ గాలించినన్ లేరొ స
చ్చరితుల్ గల్గినవారినీతి వినవో చావంగనూహించితో.

చం. అనిందనపిప్పరావణునకానతిఁజూపుచు
ఘోరుచుండి యి
ట్లనె భవదీయశత్రులరయన్
సుగుణాత్ములనైచరింపనీ
మనమునకోరునట్టితరమానినులన్
సుగుణాత్ములైమనన్
మనమునకోరుదేని నినుమన్ననఁజేద
రిమ్మహిన్బుధుల్

ఆ.వె. దుష్టుడైనవాడు దూరదృష్టిసళింప
స్వాపరాధవశత జచ్చునేని
పరగసంతసించుప్రాణిజాతములెల్ల
ననివచించువారలాద్యులెలమి

కం. నీకొంపకీవె చిచ్చును నీకరణిన్బెట్టుకొనగనెంచుట లగ్గే
నీకాంతలెల్లవిధవలు గాకుండఁజూచుకొనగ
గమకింపుమికన్

ఉ. ధర్మపథంబునంజన ముదంబునరామునకప్పగించిన
న్నిర్మలి వేడెదేనిశరణాగతవత్సలుఁడాతఁడౌటదు
ష్కర్ముడవైనఁనున్నతమతంబునగాచు
భయంబులేదు - న
త్కార్ముకపాణిలక్ష్మణుడ గాదన
డగ్రజుమాటకెన్నడున్

మ. దురహంకారముచే దురాత్ముడవునై
దూషింపశిష్టుల్ విభుం
డరయంజేరువలేనివేళ నబలన్ హర్షంబునందెచ్చియి
వ్వరుసన్ సిగ్గిలకింము కేసిగు
దయావాత్సల్యహీనుండవై
పరుషోక్తుల్ బలు కంగభావ్యమగునే
ప్రావీణ్యమే రావణా ?

ఆ. వె. కరిణిసూకరమును కామింపగలదొక్కొ
మనుజకాంతదుష్టమతి-నిశాటు
నెట్లు గోరు నాస లేలదశగ్రీవ
విడిచెదేనినన్ను వెలయుశుభము

గీ. స్నాతకుండును నాత్మవిజ్ఞానవేత్త
యైనద్విజునకు సాంగ వేదాధ్యయనము
నొప్పియుండెడిరీతి
మహోత్తముడగు రామునకునేనుతగినభార్యనుదలంప

కం. పురుషోత్తముడును సద్గుణవరుడును
విజ్ఞానయుతుడు వసుధాధీశుం
డరయ మహాత్ముడునౌశ్రీకరురాముని శరణువేడ
కలుగున్నుశుభములే

కం. తనవల్లభునింగానక
వనమునదుఃఖించుకరిణివలె పతినిగనన్
మనమునవంతదపించెదీ
ననురామునితోడగూర్చి నయగారమునన్

గీ॥ శరణుజొచ్చిన రాముడ శత్రుడైన
దయనుమన్నించు రావణా! ధర్మవేత్త
యగుట నాతనిమైత్రినీవభిలషించి
నన్నునర్పించినన్ శోభనములెసంగు

చం. శమనునికాలదండమును
శక్రునివజ్రము విష్ణుదేవుచ
క్రమును పురారిశూలము
ధరణ శరణన్నినుగావవచ్చు వి
క్రముడగు రామచంద్రుని
శరంబులుప్రాణముదీయ కెట్టుశాం
తమునువహించు శీఘ్రమున
ధర్మునివీటికిబంపు రావణా

గీ॥ రామతార్క్ష్యుడు దనుజసర్పములజంప
వచ్చు ననుజునిగూడినీవనితలెల్ల
వారి శరములఘాటికివగపుగదుర
నొందుదురువిధవాత్వము పొంగునణగ.

మ. పురుషశ్రేష్ఠులు రామలక్ష్మణులు
సంభోధిన్వెసందాటి నీ
పురమందెల్లెడ వాడిబాణచయమున్
భూరిప్రతాపోన్నతిన్
వరుసన్సింపుచు నీసమక్షమున నీవారిన్వధింపంగ చె
చ్చెర నగ్ని చెనీవు నిక్కముగ వాసిందక్కి గొను రావణా

గీ॥ శౌర్యనిధిరాముడా జనస్థానమందు జంపె
ఖరదూషణాదిరాక్షసుల నొకడె
గాంచుమాంగనదుర్దశ కలుషమడచి
దుష్టుడైనవిరాధుని ద్రుంచెవినవె.

కం. దేవేంద్రుడైన రామునితో వైరంబూనెనేని
దుఃఖించుజూమీ
నీవనెంత నిశాచర వైవస్వతుపురికినేగ వాంఛించితివే

గీ. తగరుకొండనుదాకువిధంబుదలప
నీవు శ్రీరామచంద్రునినీచబుద్ధి
నెదురుకొనజూచుటయు శుభ మెట్టులున్న
ప్రాణములుగూడదక్క వేర్పడనిజంబు

వం. వరుణునిచెంతకేగినను దానవునిన్ శరణంబు వేడినన్
సరసిజగర్భుదీనమతిసాయముగోరిన వార్ధిదాగినన్
త్వరబరువెత్తిపోవుమని ధర్మునిపాదములందు వ్రాలినన్
మరణముతప్పదింక రఘుమండనుచే
వడినీకు రావణా.

కం. అనిపరుషోక్తులరావణు జనకజతర్జింప
రాక్షసప్రభుడాపై
కనులెఱ్ఱన గానిట్లను నినుమెచ్చితి
నన్నునీవునిందింపంగా

కం. రామునికడు శ్లాఘించుచు
నీమెయిబెదరింపనన్ను నేమగునీవా
రామునితో మోడంబున
కోమలి సుఖియింపగలవె గొంకకచెపుమా

కం. నీకేర్పరచినగడువున
నో కోమలిరెండునెలలు నోపికతోన
వ్యాకులవృత్తిసహించెద
నాకడపలనాకుసుఖములందింపవలెన్

ఉ. కామమసహ్యమౌటనది కామినియెవ్వరిపైవృథంబుగా
నీమహిపుట్టు వారలకనెన్నివిధంబ లనీసటించినన్
ప్రేమయు జాలిమైత్రిగడుపెద్దగ
పెంపువహించువారిపై
నేమెయికోపమూనడు
సహించును నైజమిదేగణింపగా

ఉ. వైరమునన్దశాననునివాసవుడేనిజయింపలేడ హం
కారమునన్దిగీశులనుగాటియవెట్టితి నాకుసాటియె
వ్వారలొకోత్రిలోకముల వాడిమి
మానవుడొక్కరుండు నే
తిరుగనన్నెదిర్చి జగతిన్మనజాలునొ నిశ్చయింపుమా

ఉ. నేనీదాసుడ నిన్ను భక్తిగొలుతున్
నీ సాన్నిధ్యమున్నింతు నా
పైనీ ప్రేమకటాక్షముంబఱపి సౌభాగ్యంబుదీపింప న
త్యానందంబునెసంగ బ్రోవవలె
మోహాంధుండనౌ నన్ను నీ
వానిన్ రక్తితరించుమార్గము
యశోవాల్లభ్యమున్గూర్పుమా

గీ. రెండునెలలుగతించిన
ప్రీతినాదుపొన్నునపరుండవలయు శుభంబులొదవ
నీవు—మూర్ఖత్వమూనిన నిశ్చయముగ చంపబడెదవు.
రాక్షససతులచేత

కం. సీతనురావణుడివ్విధి పాతక డైమందలింప
భయపడునామెన్.
బ్రాతిగ ముఖసంజ్ఞలచే
నాతరుణినినూరడించి రచ్చటికాంతల్

గీ. రావణునివెంటవచ్చిన
రమణులైనదేవతాస్త్రీలు గంధర్వకాంతవల్లిజ్ఞు
నూరడించిన జానకియుతెలివొంది
రావణునకిట్టులను నిబ్బరముపహించి

మ. రమణుండాశ్రమమందులేనితఱిదుర్మార్గుండవైజొచ్చినీ
చమతిన్నన్నుహరించి దెచ్చితివి
నీశౌర్యంబుసామాన్యమే
సమరంబందు నెదిర్చిరాముని
భుజోత్సాహంబునేపార ధీ
రమతింగెల్చిన నీపరాక్రమమునాధైర్యంబున్ బ్రశంసించెదన్

కం: దేవేంద్రునిసద్భక్తిన్ సేవించెడి
శచినిబోలి చెలువున నేస
ద్భావంబున శ్రీరామునిసేవించెద
నితమసెట్లు చెరుద జెప్పుమా.

సీ॥ కపటుసారంగముకల్పించి
నాపతిన్దూరంబుగానంపి దుష్టమతిని
నన్ను దొంగిలిదెచ్చినావు
కుబేరునితమ్ముడననియెద ధర్మమగునె
శౌర్యముగలదేని సమరోర్విరాముని
నెదిరించియుందువు హీనుడగుట
యజమానియింటలేనట్టివేళను
కుక్కదూరిరత్నంబునుదొంగిలిచు

తే. విధము నీయందువరికింప విశదమయ్యె
సర్వలోకార్చితుండును సాహసుడగు
రామునిజయింపనెంచుట రాక్షసేంద్ర
శశముదంతినిడీకొన్న చందమగును

ఉ. బీరములాడనేల వినిపించెదసత్యము వేయునేల దు
ర్వారపరాక్రమాఢ్యుడగు రాముడు
తమ్మునితోడగూడి నీ
వారల నీసమక్షమున వాసినడంగవధించు నీదురా
చారఫలంబు నీసతులసత్వరమే
జవిజూచు వారలున్.

౹౦. అనిన దశాననుండున భయంకరుడై కనులెఱ్ఱగాగ నా
జనకజతోడనిట్లను నిశాచరనాథుని నన్నుఁజీరికిం
గొనక దరిద్రుడైయుశముగోల్పడి
కానలసంచరించు రా
మునివినుతించు నీరసనముక్కలు
చెక్కలుసేయగాపలెన్

౧. నను నిందించినపాతకంబునకు నీనాడేవధింపంగనొ
ప్పును నాతోఁప్రతిభాషలాడెదవు
నన్‌బోరన్‌జయింపంగ రా
ముని పేర్కొంటివి యింద్రుకాలు ననలున్
మున్నేను యుద్ధంబునం
దుననోడించిన నాబలంబెఱుగకన్
దూషింప నీకర్హమే

౦. కినిసి వచించు గార్ధభముఖిన్
వికృతాస్యను వెండి యేకలో
చనను విశాలనేత్రను భృశంబగుకర్ణములంజెలంగుదా
నిని పొడవైననాల్కను గణింపగనొప్పెడుదాని లంబమౌ
స్తనములనొప్పుదాని గని
దానవనాయకుడిట్లు బల్కెడిన్

౧. వినుడు నిశాచరకాంతలు
జనకజననుగూడి ప్రేమసామ్రాజ్యము నొ
య్యననేలురీతిజేయుడు
నను రాగము కరుణగలిగి యభిమానింపన్

కం. అని చెప్పు మంటిమాటికి
జనకసుత గాముందలింప సంతోషము మో
మున నొప్ప ధాన్యమాలిని
యను రావణుపత్ని నాదశాస్యునకనియెన్

ఉ. కాముని కారణమ్మాని నినుకాంక్షవరింపని దానిపొందు నీ
కేమిసుఖంబొసంగునని యిప్పిధి
వ్యర్థముగానదల్చెదో
స్వామి శరీరకష్టమగు వాదము లేల నన్వరించి నీ
కామముదీర్చుకొమ్ము
దమకంబున యిచ్చకువచ్చినట్లుగాన్

కం. నినుకోరననతితోడన్ మనసిజసౌఖ్యముల
ధీరమతి క్రీడింపన్
మనమునకాహ్లాదమ్మగు
జనకజకాభాగ్యమెట్లు సంప్రాప్తించున్

కం. అని ధాన్యమాలినుడివిన
దనుజాధిపుడంత తీవి దర్పము లెన్నయన్
తనసతులెల్లరుఁగొలువగ జనకజ
నటువిడిచియేగె సదనంబునకున్

ఆ.వె. రావణుండు వెడల రాక్షసస్త్రీలంత
జనకసుతనుఁజూచి సరభసమున
భయముఁనొందిరామపత్ని శోకింపగ
నిట్టులనిరి కోపమెసగ నపుడు

గీ. షట్చ్ర ... తులందు తేజము
యశంబునొప్ప రాణి చు నలవులస్త్యంశనంగ
మౌనికులశేఖరుండు సమ్మాన్య
డతనికొడుకు విశ్రవసుండన కొమగ మిగలు.

కం. అవిశ్రవసునికొడుకిరావణుశీల
నితనిత్రీ ... జనసముం దే
జో వైభవము ల ... రసి
వేవేగ చెట్టుబట్ట వెలయునుశుభముల్

గీ. అమరుల నివాతకవచుల నాజిగెలచి
కాలకేయుల నడప విక్రమ మెసంగ
వెలయు దానవనాధునివిడిచి
పేదనను నిశాన్క్షింప లేదుయానందమింత

కం. హరిజటయనెడి నిశాచరి
పరుషోక్తులనిట్టులయె భయపెట్టుచు ...
దరిజా ... కితో నత్తతి హరిణాక్షి
దశాస్యు బెండ్లియాడి సుశుభమౌ

గీ. రావణుని భార్యలందు ధీరమతిజెలగి
సుందరాంగియనంగ నస్తోకపటిమ
నొప్పు మండోదరిని పీడియున్
దశాస్యుడరయనీతోడ నానందమను ...

కం. లంకారాజ్యము నీకకలంకమతిన్
ధాన్యాసంగి లావణ్యవతీ
సంకోచములేకింతయు లంకేశుడు
నిన్నుగొలుచు లాలిత్యమునన్

సీ. సూర్యుడెవ్వనిభయమునశోభదక్కి
విన్నదనమొందు ననిలుడువీవవెఱచు
నట్టి బలవంతుడైన దశాస్యువలచి
యనుభవింపుము సౌఖ్యము లంబుజాక్షి

ఉ. నీవుమహాపరాక్రముడనింద్యచరిత్రుడు
ధీవరుండు నా
రావణునిన్ వరించి రతిరాజసుఖంబులనోలలాడి నీ
యౌవనమీధరిత్రి చరితార్థతనొంద విశేషవైభవ
శ్రీవెలయన్ శుభంబులనుజెందుము
దైత్యులసేవలందుచున్

కం॥ రావణునిన్ దూషించుచు
నీవిభుడగురామచంద్రునింపూజింప
గా వాంఛించెదవేనిన్ భావింపగ
నిన్నుజంపిభక్షింతుమికన్

కం॥ అనిజెప్పిన కడుభీతిన్
జనకజదనుజాంగనలను సరకుగొనక ని
ట్లనె మీరెల్లరు సత్వరముగనన్నుందినుడుజంపి
ముచ్చటపడుచున్

ఉ. మానవకాంత రక్కసునిమెచ్చిక
గోరివరించుటెట్లు నా
మానసమందు గోరెద నమానుషశౌర్యునిరామచంద్రుని నీ
తోనిక వాదమేల ననుదున్మి భుజింపుడు తృప్తిగా యశం
బో నిరతంబు పాపముగుబోవెరుపినన్మది
నింతు కేసియున్

ంత్త కోకిల :-

రాముఁడేగురుడన్ విభుండును రక్షకుండు సఖుండునున్
రాముడేననుగాచుదేవర రామునేభజియింతు-నా
కామితంబులుదీర్చి జెచ్చెర-గానురామనృపాలుడేఁ
గామసంబున మీరలిట్టులదల్ప నేమిఫలంబగున్.

గీ. దురితమతి నన్నుకాంక్షించు ద్రోహియైన
రావణునకగుఘోరపరాభవంబు
సందియములేదు దుర్వ్యవసాయమునకు
ఫలముజేకూర్చు శ్రీరామబాణములిక

కం॥ నాపైనయుమీకేలా పాపంబనకీరు
నన్నుభక్షింపుడు మీ
వ్యాపారంబిదియేగద మీపైయలుకేల
రక్తిమెసవగవచ్చున్

సీ సౌదాసుమదయంతి సగరునిన్కేశిని
చ్యవనుసుకన్యయు సత్యవంతు
సావిత్రియు నగస్త్యు సాధ్విలోపాముద్ర
మమవుశచీదేవి మాన్యచరితు
దైనవసిష్ఠుని నలయరుంధతి
నలున్దమయంతి భీమునితనయ-
యనున-రించువిధంబున ప్రీతి శ్రీరామునిన్ సరిబెడ
వినుడంతేగాని

గీ॥ బలియుడైనను త్రైలోక్యపాలనుండు
నైననన్యుని నామదినభిలషింప
నెన్నడేనియు కఠినోక్తులేల వలుక
కాంక్షదినరండు నన దైత్యకాంతలార

కం. అనివాపోవుచు భయమున
హనుమంతుడు దాగియున్న యావృక్షము దా
పున కేగినిలువ రాక్షసవనితలు
గొడ్డండ్లబూని వక్రవదనులై

కం. బెదిరించుచు భయమొందగ
నదలించిరియిట్లు రామునస్తాంతుంబున్
మదనిధ జించెడిన్నో సుదతీ
పరిమార్పదగు ఋషుల్ నరలేద్యన్.

## రాక్షసకాంతలు సీతను బెదిరించుట

ఆ.వె ఏడు వేలమంది యింతులు
నీవశమందునిలిచి సేవలాచరింప
రఘునీ సేవ్యుడైనరావణు పెండ్లాడి
వినుతి సుఖములనుభవింపగ వె

కం, నీకుండెబెటికి నెత్తుగుత్తాగుదుమా
మేనుగోసి కమిలా గా
ప్రేగులు మెసనుధరింతుమొ
వేనువ ఏలు ఘమోన విపాతేంగ కళీ

ఉ. ఏవిధి వచ్చురా ముడిటు కేర్పడజెప్పుము వార్థిదాటి-దు
ర్భావనవచ్చెనేనియు పరాక్రమపర్యదశాస్యుయుద్ధమం
దేవిధినొంచు దేవతలకేనియుశక్యము నైనదాని వా
డేవిధినిర్వహించి వనజేక్షణనిన్ను పరిగ్రహించెడిన్.

ఉ. పేదనరున్మహాత్ముడని పెద్దగమెచ్చెదు
దుర్వినీతి ము
ర్యాదనతిక్రమించి యసురాధిపునిట్లు తృణీకరించి దు
ర్వాదములాడ నైపగ వారమె
నిన్ను వధించి మాంసమున్.
మేదురలీలమెక్కి నిను మిత్తికినప్పనసేయగాదగున్

కం॥ అని దనుజకాంతలెల్లరు జనకజ చాలుకలనాకి
చనిజూచుచు నీ
వనితనుజంపి ప్రియమ్మున
తనువునుభక్షింతుమనుచు దాపునజేరన్.

గీ। వారలనుజూచి వదనము వాడసీత
భయము శోకము మదితడబాటునొంద
రామ దుఃఖించుచున్న నీరమణివెతలఁ
దీర్ప రావేల యనుచు నార్తినిపహించి

మ॥ నినునిందించిన పాపమిక్కరణినన్
నిక్కంబుబాధించు రా
ముని ప్రభక్తిగఁ ట్టిసోదరుడవే
మూఢుల్గదాస్త్రీలు వా
రినిధీరుల్ క్షమియింతురేగద
భయార్తిన్బొక్కు నీయన్నభా
ర్యనురక్షింపగలక్ష్మణా దనుజులన్ ప్రమందింప రావేఁదమిన్

ఉ. రాముని నామనోహరు
పరాక్రమవర్యునిబాసియిట్లు నే
నేను రాముచాన్తకిని జీవములిమ్మెయినిల్పియుంటి నో.
రామునుశీల నాబ్రతుకురమ్యవిహీనము హేయమై కళా
రాముడు లేనిజేయివలె
లాపమునొందుచునుండె నక్కటా

కం॥ హా రామా! జెడితిగదా
నీరామామణివిధంబు నీచావస్థన్
గారామారగదీర్పుము బోరాములుచక్కబఱపి
పురుషశ్రేష్ఠా

కం, అత్తా కౌసల్యా నేనిత్తరివంచింపబడితి నెట్లో రామా
యత్తమునాచిత్తంబగు నుత్తలపాటొందె
బుద్ధి యోరువవశమే

ఆ.వె. విభునికొఱకు నిట్లువిలపించునా వెతఁ
దీర్ప నింద్రుడాది దేవతలకు
జాలిలేదు నాకుసాయంబొనర్చెడి
వారలేరు లేరు వసుధనింక

గీ॥ పతినినెడబాసి శోకించునతికిసుఖము
లేదు మరణమువాంఛింపరాదు సుమ్ము
వాదమే గాని నామనఃఖేదమేరు
దీర్చువారలు మోదముగూర్చువారు

ఉ॥ శిలపడి రామలక్ష్మణులదానవనాథుఁడు
మాయవన్నెఁజే
రలుకఁ వధించియుండఁడని
యాత్మదలంచెద లేదయేని యు
జ్జ్వాఁమతులున్ రఘూత్తములు
వాడిమిదక్కఁ సహించియుందురే
ఖలుడగురావణాధమునిగర్వమడంపక నిర్విధిం గటా

కం॥ కపటమ్ముగాకృతివచ్చిన
కృపణుండీ రాఘవులకుకీడొనరింపన్
నిపుణుండనిమదినెంచెద.
నపకారంబొదవె మాకునసురులచేతన్

మ॥ కమలాక్షుండు మహారథుండును
శుభాకారుండునున్ సద్గుణో
త్తమసంపన్నుఁడు పీనవక్షుడును
నిత్యానందసంధాయకుం
డమలుండాశ్రితరక్షకుండు
పరమాహ్లాదమ్ముజేకూర్చు వి
క్రమవర్యుండగురామునింక
గనుభాగ్యంబెంచ దీపించునే

కం॥ జనకజనై దశరథునకు
ననుగుంగోడలను రామునర్ధాంగినినై
దనుజులబారింజిక్కితి
వనటన్ విధివ్రాలుజెఱుప వశమేరికినో

కం॥ చరణములనైన రావణు
నరయంగాదాకనోప నంగనలారా
ద్వరనన్నుంభక్షింపుడు
కరుణనసుంజూడకీరు కౌతుకమెసగన్

గీ॥ వృద్ధుఁడైనజటాయువు
విక్రమమునరావణునెదిర్చి మహిసమరంబుజేసి
నినుతికెక్కెను ప్రాణముల్ విడుచుదనుక
నన్నురక్షింప సజ్జనానందమెసగ

కం॥ కాంతలుగారా మీరలు
కాంతునినెడబాసి యెడదకాఱియవడు నా
వంతనుదీర్పకపోగా
పంతంబుననపహసింప భావ్యంబగునే

కం॥ నేచెట్టులేడ్చుచుంటినో
దానవసతులట్లు శోకతప్తలుగారే
భానుష్కుడైసరాముడు
దానవులన్‌జంప సముద్రమునన్‌రాగా

కం॥ లంకామార్గములన్నియు
పొంకమునశియింప పీనుగుపొగలంగప్పన్
కొంకకగ్రద్దలతోడన్
లంకశ్మశానంబుగాగ లక్షరాణించున్

కం॥ క్రూరుండధముడు నీచుడు
నీరావణుడింక నిర్ణయించినమితిలోన్
శ్రీరామునిచేఁజచ్చును
నేరస్థులకెల్లశుభము నెలకొనునిలలో

మ. కరుణామూర్తులు రామలక్ష్మణులు
విక్రాంతిన్ధనుష్పాణులై
దురహంకారులునైనరాక్షసుల
నత్యుత్సాహమేపార జె
చ్చెరజంపంజనుదెంచువారలు
యశశ్శ్రీదిక్కులన్నిండి భా
సురకాంతిన్జెలగన్
భయంబడగినాశోకంబుదీరన్ వడిన్

కం॥ ఖరదూషణాదిదనుజుల
పరిమార్చినధీవరుండు పక్షిహర్తన్
పరిమార్పకూరకుండునె
మరణింపకయుండునేని మాన్యులుమెచ్చన్

గీ॥ బ్రతికియుండిన రామభూపాలుడనను
కావకుండునె ఘోరదుఃఖంపువార్త
చెవులబడకుండ మరణించిశీఘ్రమేను
త్రిదివమునుజేరుటింక రక్తినిశుభంబు

కం॥ నరకంబైనను సాధుని
సరసననేనుండుకొఱకుఁ జాలించెదదు
ర్భరమగునీజీవితమును
పరగన్ మీకేలకరుణ భక్షింపుడికన్

కం. అనియివ్విధిదుఃఖించెడి
జనకజభక్షింతుమనుచు సాధ్వసమతి న
ద్దనుజాంగనలొక్కుమ్మడి
జనుదెంచినవారినిలిపి సంరంభమునన్

ఆ.వె. త్రిజటయనెడు ముసలితెఱవ
వారించుచు దనుజసతుల సమ్ముదమునబిలిచి
మీకుమంగళమును మేలుగూర్చెదు నాదు
పలుకులెల్లవినుడు భామలార

గీ॥ దుష్టమతిమీరు జనకునిదుహిత సాధ్వి
దశరథాఖ్యునికోడలున్ ధర్మచరిత
యైనసీతను బాధింపనర్హమగునె
వెలయునశుభంబులిక దైత్యనితతికెంచ

చం॥ కలనొకదాని నిద్దురనుఁగాంచితినేనిపుడమ్మలార యా
కలనుదంప మూగసముకంపమునొందు
పరాక్రమాఢ్యుడున్
బలయుతుడైనరామునకు
భద్రములింపునకల్గినట్లు ని
ర్మలినచరిత్ర చంద్రముఖి మైథిలి
కాంతునిగూడినట్లుగాన్

## త్రిజటా స్వప్నము

గీ॥ అనిన నీగాంచినట్టి భయంకరమును
నశుభమైనట్టి స్వప్నము నానతీయు
మనినదనుజాంగనలజూచి యంతమీద
త్రిజటచెప్పందొడంగె ఖిలినివడకుచు

ఉ. తెల్లనిపుష్పమాలికల తెల్లనివస్త్రములన్ధరించి యు
త్ఫుల్లసరోజనేత్రుడగు పుణ్యవతంసుడురామమూర్తి వి
దృల్లతభంగి నభ్రమునమూగుచు
హంససహస్రసంయుక్తమౌ
పల్లకినెక్కి లక్ష్మణునమ్మః స్తు సేయగ వచ్చెలంకకున్

గీ॥ దంతిచంతములన్ నిర్మితంబునగుచు
నంతరిక్షమునందు శోభాకరంబు
నగుచు రాణించు శిబికప్రియంబుతోడ
నెక్కి రాముని జేరె నీయింతిసీత

ం॥ అరయచతుర్దంతములన్
గిరివలెదీపించుగజము కీర్తింప దయా
కరులారాఘవులెక్కగ
పరికించితిస్వప్నమందు భామినులారా

ం. లంకాపురమునదిరుగుచు
సంకటపడుచున్నసీతసన్నిధికిన్ ని
శ్శంకమతిన్దాశరథుల్
ఢంకామ్రోగంగ వచ్చుటను కలగంటిన్

గీ॥ శ్వేతగిరిశిఖరముననాసీనుడైన
రామచంద్రునిచెంతకీరమణి సీత
యరిగి భద్రగజంబుప్రియంబుతోడ
నెక్కినట్టుల కలగంటి నింతులార

కం. తామరసాక్షమహీనుత
రామునితొడనెక్కి ప్రీతిరవిచంద్రులగా
రామునబట్టినరీతిని
కోమలి దనవిభునిరక్తి గూడినరీతిన్

కం॥ పురుషోత్తముడగు రాముడు
సరసమతిన్లక్ష్మణుండు జానకిగొలువన్
వరపుష్పకయారంబున
నరిగెనుత్తరపుదెసకు నతిమోదమునన్

మ॥ పరగన్ రాముడునీత్రిలోకములనాప్యాయంబున్ర్మింగిన
ట్లరయన్ పాలసముద్రమందునహిపై
నాదిత్యులెల్లన్మనో
హరవృత్తింగొలువంగ మోదమున
కోట్యర్కప్రభన్వెల్గు శ్రీ
హరిరీతింగనుపట్టె
లక్ష్మవలెనీయబ్జాక్షియొప్పెం గలన్

కం। శ్రీమన్నారాయణుడే
రాముడు-లక్ష్మంశసీత-రక్కసులన్ సం
గ్రామమునజంప నివ్విధి
నీమహిజన్మించెనంచు నెంచెదమదిలో

గీ. రక్తవసనుండునై నూనెద్రావి
కైపునొంది గన్నేరుపూదండలొనరదాల్చి
నేలపైరావణుడు శయనింప
కలనుగాంచితినినేను దానవకాంతలార

గీ. పుష్పకవిమానమునుండి
పుడమిగూలినట్టిదశకంఠునంత కృష్ణాంబరముల
దాల్చి కేశవిహీనయౌ తరుణి
యీడ్చుకలనుజూచితి నామదికంపమొంద

గీ. రక్తమాల్యాంబరంబుల
రక్తగంధమునుధరించి యున్మత్తునిననుకరించి
ఖరమునెక్కి దక్షిణదిశనరుగురావ
ణుడును తలక్రిందుగాబడె పుడమిమీద

కం. ఖరవాహనములపూన్చిన
నరదంబులనెక్కి రావణాత్మజులెల్లన్
త్వరపడుచున్ దక్షిణదెస
నరుగంగాగంటి కలయథార్థముసుమ్మా

మ. దురితాత్ముండగుకుంభకర్ణుడు
ప్రహస్తుండాదిదైత్యుల్ బరా
బరి వెంటున్నడువంగ
తైలమునుసంభావింపగా ద్రావుచున్
త్వరనుష్ట్రంబునునెక్కి దక్షిణముగా
దర్పంబునర్గవోవ, సూ
కరమున్రావణుడెక్కె-
నింద్రజితుడున్గాంభీర్యమెల్లంజెడన్

ఆ.వె. మకరమెక్కి జమునిమందిరపుందెస
నసురులెల్లఁ గొలువ నతిముదమున
నూనెయందుమునిగి సూనెనుద్రావుచు
నేలబొరలగంటి నేనుకలను

గీ. శ్వేతమాల్యాంబరంబులచెలువుమిగిలి
శంఖభేరీమృదంగనిస్సాణరవము
లుల్లసిల భద్రగజముపైనొప్పిమెఱసె
మన్నన విభీషణుండుసామాత్యుడగుచు

కం. తురగంబులు నేనుంగులు
నరదంబులతోడ భగ్నమై యీలంకా
పురమెల్లజలధిగలిసిన
కరణిఁ గాసతులార నేనుకలగంటి నిశిన్

ఉ. రావణరక్షితంబును దురాసదముఁగా
రమణీయకాంతి శో
భావహమైనలంక నరయన్
రఘురామునిదూత ధీరుఁడున్
పావనుడైన వానరుడు
భస్మముచేసినరీతి స్వప్నమం
దేవెఱగందగంటి నికనెంతయుమోసమునచ్చె లంకకుఁగా

గీ. రాక్షసస్త్రీలు తెలమ్ముద్రావి
నర్తనమునుసేయుచు నేడ్చుచు నవ్వుచుండు
నరణి భస్మమాత్రావశిష్టమునునైనలంకలో
సంచరింప కలంగనపడె

ఉ. దానవకాంతలార యికదర్పముపీడి
సుమెంపనెంచినన్
సేనమతిన్ మహీజను సుధీరచరిత్రను గావవేడుటే
మానితమైన కార్యమనుమానములేదు
జ సుంబుల్గు నా
భానుకులాబ్ధిచంద్రునకు భంగపడుఁగా
శోకం. డింకపై

ఉం. సురుచిర రూపసంపద
యశోవిభవంబుల దీప్తి సద్గుణా
భరణయనన్ రహించుచు
కృపాకలితాత్మయు శోభనాంగి యీ
ధరణిజ మీరలిమెనునదల్పక
పాపములంటి భర్తతో
శరణము వేడుడీత్తరి
నిజంబ శుభంబులు మేకొనన్ ధరన్

కం॥ పాపిష్ఠునకుకీ స్వర్గము జేపడుటయు నెట్లో
దుష్టచిత్తుగు చపలుం
డౌ పాపిరావణునకున్
జేపడువిజయంబునట్లె సిద్ధముపృథివిన్

మ. అరుదెంచున్ రఘురాముడీవ్వటుకు
దైత్యవ్రాతముంజంపి జె
చ్చెరసీతంగొనిపోవుతథ్యమిది
దుశ్శీలుండునౌ రావణుం
డరయన్ పుత్రయమాత్యకింకరులతో
నాజిన్ వడిన్ జచ్చు ని
త్తరి సీతన్ శరణంబు వేడుటయె
కర్తవ్యంబు భావింపగా

కం॥ ఉదాంత్రావయవంబుల
శోకంబువహించు వేళగుజుంపట్టుదు శో
ఘోరరక్తై గనుపట్టెడు
ప్లైకల్యసం సంగములను వర్తింపదుగా

గీ॥ తరుణి దుఃఖార్తయగుచునెడంగృశింప
నిట్టిస్వప్నము కలిగిన నింక మీఁద
దుఃఖమునువీడి మిగులసంతోషమొందు
నాసతీమణి నిక్కమో యువతివలార

చం. ధవునెడబాసి మైథిలి వెతంబడు చుండగ
శోభనంబులన్
ప్రవిమలశైజనంపద విరాజిలునట్టుల
స్వప్నమందు నా
ధ్రవమునభర్తచెంగటు నెసంగినతీరునుబట్టిమాఁడ ని
య్యువిద యశేషభోగములనొప్పు
మనోహరుగూడి ప్రేముడిన్

కం॥ వామభుజంబును మఱియున్
వామాక్షియు నదరుచుండెవనితకు నదిగో
రాముని రాకనుదెలుపుచు
ప్రామాణ్యముగాగ గరుడపక్షియుకూసెన్

కం, దురహంకారము చేనిటు
ధరణిజబాధింపతగదు తక్షణమిఁకమెన్
శరణము వేడుడు మనకె
క్లురకుశుభంబగును వెండిలాభములొదవున్

కం॥ అన దనుజాంగనలెల్లరు
జనకజకున్ మ్రొక్కి పిదపశయనింపగ రం
జనకేరొకతాపునకున్
జనకాత్మజయందంబునొందిజానకి యంతన్

గీ భర్త నెడబాసి దనుజునిబారిఁబడుట
యసురవనితలుబాధించుటరసి వంత
నిట్లుచింతించె కష్టములింకయెన్ని
యనుభవింపగనుంటినో యవనిమీద

క. ధరణిజనైజన్మించితి
హరిహయసన్నిభుడు దశరథాఖ్యునిస్నుషనై
హరివిక్రముడగురాముని వరవర్ణిని
నాకువెతలుబాటిలె నకటా

శా. రామా రావణునిన్ వధించి
సతినిన్ రక్షింపరావేల యో
సౌమిత్రీ ననుమాఱకియ్యెదనునన్
శౌర్యంబుదీపింప నే
డీమాయావులదున్మి శీఘ్రముననన్నింపార మీయన్నతో
సామంజస్యముగాగకూర్పుము
మహాప్రాసుండవై ప్రేముడిన్

గీ. అశనిపాతాన సింహద్వయంబుజచ్చు
నట్లునిట్టిదైవచ్చిన యసురుచేత
ద్రుంగ్గియుందురురామలక్ష్మణులు నిజము
కాలుడేవచ్చెనేమొ జింకవలె నటుకు

మ. పతియే దైవముగా వలంచి
మదిలో ప్రాణేశ్వరుం గూర్చి స
మ్మతినిష్ఠం దలపోయుచుండ
దురితాత్మన్ రావణుండిటన్ నసున్
సతిగా గైకొన రెండుమాసములు నెంచన్
నిర్ణయించె గదా
మితి - నాకెవ్వరు దిక్కు గాచుటకు
దుర్మేధన్ బ్రలాపించినన్

గీ. ఉర్వి రాముడు జీవించియుండు నేని
సంభవించునె నాకిట్టిచందమరయ
పతిమరణవార్త వీనులబడకముందె
చచ్చుటయు లెస్స నాదునిశ్చయమునిదియె

కం. అని విలపించుచు జానకి
దనదేహము వడక విరహతప్తయునై రా
ముని మదిలో ధ్యానించుచు
వినతిం జనె హనుముడున్న వృక్షము కడకున్

చం. వెనజని దుఃఖభారము స్రవేచుచు
హారము రామచంద్ర ర
క్కసులు అనేకభంగులను
గాఱియు వెట్టగ దైన్యవృత్తి నే
గసిమసినొంద నించుకయు గాంచక
నిష్టులుపేక్షసేయగా
నసము మొసంగునే కలుషితాత్ముల
జంపక మిన్నకుందువే

గీ. నినముదినియొల్ల నాయుధవితతిచేత-
బాప నెంచిన లభియించు జాడ యెట్లు
వేణిను గివోసుకొని జచ్చి వెడలుదాన
యామ్యపురమునకైన బ్రియంబుతోడ

గీ. శింశుపావృక్షపుంగొమ్మ చేతబట్టి
యుర్వీపుత్రిక మరణమునొందదలచి
చావగానుండ యెడమభుజమ్ము
నెకమతొడయు సయనమునదరె సంతోషమెసయ

కం మృదులమగు వలువజారెను.
పెదవి యుకంపించె ముఖము పేరిమి కాంతిం
బొదలెన్ శుభశకునంబులు
నెమరన్ గన్పట్టె నామహీజకు దోడ్తోన్

గీ. దుఃఖతాపములడగి నంతోషమొదవ
శుక్ల పక్షహిమాంశునిశోభ దనరి
జనకజముఖమ్ము కడువికాసముననొప్పి
దీప్తిరాణించె కష్టముల్ దీరునట్లు

ఉ. రాక్షసకాంతలాజనకరాజతనూజను
దీక్ష్ణవా క్కతిన్
రూక్షముగానదల్చుటయు
రోషము వన్దశకంఠుడట్లు సా
పేక్షవరింపుమంచు వెఱపించుట
జూచుచునుండె శింశుపా
వృక్షముమీదనున్న కపివీరుడు
నాహనుమంతుఁ డత్తఱిన్

చం. సుమతి శచీ భవాని యనసూయ
యరుంధతి సాటివచ్చు యా
రమణి మనోవిభుండగు
రామునిబాసి యనాథపోల్కి దై
న్యమునభయంబునొంది
విరహంబునబొక్కుచుండజూచె వి
క్రముడగువాయునందనుడు
కన్నులవెల్వడ దుఃఖబాష్పముల్

చం. సురదన సుందరీమణి
యశోధన సాధ్వీసుశీల సద్గుణా
భరణయునై రఘూద్వహునిపత్నియునై
పెనుపొం నామె యా
ఒరివిధియాజ్ఞనిత్తటి
దలంపగనాథునిపొందుబాసి - దు
ర్భరమగువేదనంబొరయ
పావనిజూచి విషాదవక్త్రుడై

కం. తనమది నివ్వెఱచింతించెనుహనుమంతుండు
నిచటసీతనురక్తిం
గనుగొంటి నీమెకొఱకై
వనచరులిలతిరుగుచుండ్రి వాసిమెఱయగన్

కం. జనకునిముద్దులపట్టి ను
సనుపమబలుడైనరామునర్ధాంగిని లం
కనుజూచితేమధన్యుక
జనకజనేడిట్లు నసురసమితికి జిక్కెన్

కం. చూచితిమైథిలినిచ్చట
చూచితిరాక్షసులవిధము సురసన్నిభుడున్
గీచరితుడైనరావణు
జూచితి నోదార్పవలయు క్షోణీశనయన్

కం. రాముని సందేశంబును
భూమిజకుంజెప్పి రామభూపాలునకున్
భూమిజసేమము జెప్పుట
సామంజస్యంబు దూతచందంబిదియే

కం. కోమలినాశ్వాసింపక
రామునికడకేగిచేసి ప్రాణంబులనీ
సీమంతినినిచ్చుగదా
ధీమంతుండుసుమార్గుడనుచుదిట్టరె నన్నున్

చం. ధరణిజనూరడించక
వృథాజన రాముడునన్నుజూచి నా
తరుణినిజూచివచ్చితె
నితంబిని యేమనిచెప్పునాకు స
త్వరమునదింపుమన్న
దలవంచినసన్నని రాముడంత నీ
వరయగమూర్ఖబుద్ధివని యౌర
ననున్‌సిరసింపకుండునే

సీ. బ్రాహ్మణులవోలె సంస్కృతభాష నేను
మాటలాడిన బెదరి యిమ్మగువ కోతి
సంస్కృతమునెట్లుభాషించు
సత్యమితడు రావణుండని యెంచి దూరమునకేగు

చం. మనుజులభాష యుక్తమగుచూడ్కి
ప్రియంబునమాటలాడబూ
నిన మదివిశ్వసించునోకో
నిక్కముగా సనుజాదిమానవా
శనుడని భీతి నేడ్చిన వెసర
దనుజాధము లేగుదెంచి మా
ర్కొనినగడంప యుద్ధమగు
నోల్చెదరాక్షసులెంచఱుండినన్

కం. సమరంబునవిజయంబే
సమకూరినలెస్స లేక శత్రులచేయు
ద్ధమ్మునందునోడిపోయిన
ప్రమదామణికేమి ముప్పుపాటిలునోకో

మ॥ ననుబంధించిన లేకజంపినను
దైన్యంబొంది రాముండువే
దనసీతాకుశలంబెఱుంగక
విషాదంబూన సౌమిత్రియే
మనియోదార్చు సముద్రలంమనము
సేయంజాలు ధీరుండు - శో
ధనమావానరులందులేదు
కఠినత్వంబుజ్జగింపఁదగున్

కం. జానకితో మధురమ్ముగ నేనిత్తఱిమాటలాడి నేర్పున నాపై
దానవులబలము బుద్ధియు
జానఁగాంచెదనుగాక శౌర్యంబెసగన్

౯ మంచిచెడ్డలనరసి సమంజసముగ
దూతకార్యమునెఱపక దుర్వినీతి
సంచరించిన కార్యనాశంబెగాక
ప్రభునకున్‌గీడుగూర్చి దుర్గతినిజెందు

౦. శ్రీరాముని మదిగొలిచెడి
యీరమణికి రామచరితమింపొదవంగా
నేరమి నే కీర్తించుచు
నారాటమునడచి మీదనవనిజతోడన్

౧. రామసందేశముందయార్ద్రమణిజెప్పి
మీదకార్యముయోచింతు మేలొదవగ
ననుచు యోచించి హనుమంతు
డంతమీద సీతవిన నివ్విధంబున చెప్పదొడగె

## సీతవిన హనుమంతుడు రామచరితము చెప్పుట

౧. దశరథుండను పేర ధరణీశుడొక్కడుం
దమినయోధ్యను రాజధానిగాగ
విక్రమాఢ్యుండునై విమతులనిర్జించి
వసుధపాలించె ధీవర్తనుడన
కౌసల్యయు సుమిత్ర కైకేయి
యనమువ్వురతనినతీమణులందు పెద్ద
భార్యకు సద్గుణాభరణుండురాముడు
ననబుట్టెనిర్ధాత్రి నగ్రతనయుడు

గీ. డగుచు బాల్యమునందు మునాజ్ఞనూని
తాటకనుజంపి మారీచుదర్పమడచి
శివధనుర్భంగమును జేసి సీతయనెడు
జనకతనయను పెండ్లాడె శౌర్యవర్తి

కం॥ భార్గవరాముడెదిర్చిన
నిర్గర్వాన్వితునిజేసి నిర్మలమతి నా
స్వర్గాధిపతిసుతింప సనర్గళకీర్త్యుజ్జ్వలుండునై రాణించెన్

మ. జనకాజ్ఞ దలదాల్చిరాముడు
సతీ సోదర్య యుక్తుండునై
మునివృత్తింగొని కాననాంతరములన్
మోదించుచున్ దండకా
పనముంజొచ్చి ఖరాదిరాక్షసుల
దివ్యశ్రేణికీర్తించపగా
ననినిర్జింపగ రావణుండలిగి దుర్వ్యాపార చిత్తుండునై

కం. మారీచుడనెడి దనుజున్
సారంగముజేసిబంపి శౌర్యాత్ములనౌ
శ్రీరాముని సౌమిత్రిని
దూరంబుగనంపి జనకదుహితం బలిమిన్

కం తనలంకాపురమునకుం
గొనిపోయిన జింకరూపుగొనిన నిశాటున్
దునిమి రఘూద్వహుడంతట
తనపత్నినివెదకెనడవి తమ్మునితోడన్

. రావణనామధేయుడగు
రక్కసుడొక్కడు దుర్వినీతిమా
యావియునై హరించె సుగుణాత్మక
రామ భవన్మనోహరిన్
నీవుదురాత్ముడైన రజనీచరునిన్‌బరిమార్చుమంచు న
ర్త్యావన నాజటాయువుకృపన్
రఘురామునితోడ జెప్పినన్

. లలనరోయుచు రాముడు లక్ష్మణుడును
వనమునకబంధునింజంపి వాసిమీర
సూర్యసూనయుసుగ్రీవుని సురభిళాంగు
నఖ్యమొనరించి వాలినిజంపి నంత

౯. వానరుల వీరవర్యుల
జానకినిన్‌వెదకబంపె సర్వదిశలకున్
భానుకులు-దాశరథులున్
మానసమున మోదమొంద మహిజనరయుగా

౧౦. సంపాతి జాడదెలుపగ
తెంపునశతయోజనములు తెందెప్పలునై
సొంపిలువార్ధిని దాటి ప్ర
కంపనుగతిలంక జొచ్చి గాంచితిసీతన్

౧౧. రాముండేయేగుర్తులు
కోమలికింజెప్పెనట్టి గుర్తులుగల యా
భామిని నిచ్చట జూచితి
నేమహిధన్యుండనైతి నిజమనిపలుకన్

కం హనుమంతుడివ్విధంబున
వినయంబునజెప్ప సీతవిని యాశ్చర్యం
బున నిట్టిమాటలిక్కడ
వినిపించెడివాడెవండు విస్మయమనుచున్

గీ. కొంచియపుభీతి నురివోసుకొనదలంచి
వెం(డుకలతోడనొప్పు నవ్వేలది-ముఖము
వెసనుపైకెత్తి శింశుపావృక్షమంను
నున్న బాలార్కనిభుని వాయుజునిజూచె

కం. ధవళాంబరమునుదాలిచి
ధవినొప్పుచు మధురమైనసంభాషణముల్
ప్రపచించు నాంజనేయుని
సవినయగుణగణ్యుజూచి జానకిదలచెన్

ఉ. భీమము దుర్నిరీక్ష్యమును
భీతికరంబగు వానరంబును
ద్దామగతింజెలంగ సహితంబనియెంచక
స్వప్నమందు ని
ట్లీమెయిజూచుచుంటి
మిథిలేం(దునకే వెతలుప్పతిల్లునో
రాముడు లక్ష్మణుండ ను
నరణ్యములందిక యెట్టులుండిరో

గీ. శాస్త్రములజెప్పబడియెను
స్వప్నమందు-వానరంబునుజూచినవారి కిలను
గొప్పదుఃఖములేసమకూరుననుచు
నెవరికేకష్టములు నావహించునొక్కొ.

కం॥ మంగళమగురామునకున్
మంగళమగులక్ష్మణునకు మాన్యుండును ని
స్సంగుడునగుజనకున్
మంగళముల్ గలుగుగాక మానితవృత్తిన్

ఉ. ఐనను నిత్యమేనువిరహంబునబొక్కుచు
రామనామమే
ధ్యానముసేయు నాకునరయన్
నిదురెవ్విధివచ్చు స్వప్నముల్
బూనికనన్నలంచును
సుబుద్ధివిచారణసేయ నిక్కపుఁ
వానరుయియ్యదేయని ధ్రువంబుగనమ్మితి
నామనంబునన్

కం॥ ఈవానరుడుంజెప్పిన
తేవన్ సత్యంబులగు నుడివిననుడువులున్
దేవేంద్రు ననలు ననిలుని
నావాచస్పతి విరించి హరునిభజింతున్

చం॥ అనిహరిణాక్షి మానసమునందుదలంచేఘ వేళ నంజనా
తనయుడు వృక్షముందిగి
ముఖంబు భయంబును విస్మయంబునం
జనకజజూడ ధీరమతి
సన్నుతమౌరఘురామనామమున్
మనముననెంచుచున్ భువనమాన్యుడు
చెంతకుజేరి మ్రొక్కుచున్

కం॥ శిరమునకరములుజేరిచి
ధరణిజకడకేగి నమ్రతను నిట్లనె నో
హరిణాక్షి నీవునొంటరి
పరికింపగనిచటనుండు భావంబేమీ.

## హనుమంతుడు సీతతో సంభాషించుట

గీ॥ నాగ గంధర్వ యక్ష కిన్నర
సుపర్వకాంతవగుదువో కనులదుఃఖమునవెడలు
నీదుకన్నీటిధారలు నీరజమున
పొంగు మకరందధారలపోల్కి నెనఁగు

సీ. చంద్రునిపైనల్క స్వర్గము విడనాడి
యిలసంచరించురోహిణివో లేక
ప్రణయకోపంబున భర్తవసిష్ఠుని
దిగనాడిన నరుంధతీలతాంగి
వగుదువో నీతండ్రి యాత్మేశులెవ్వరో
దేవకాంతవని బుద్ధికినిదోచె
తెలుపుమోతన్వి నీతీరునుగమనింప
పార్థివాంగణికీవు పట్టమహిషి

గీ. రాదబిడ్డవు మరిపతివ్రతయునైన
కాంతవీవనిదోచె నిష్కరుణతోడ
రావణుడుబల్మితెచ్చిన రాముసతివొ
నిక్కమువచింపుమిత్తరి నీవిధంబు

గీ. లోచనంబుల దుఃఖాశ్రులనుదొరలుటు
వేడినిట్టూర్పు వెగసెడి విధముదలప
నీవుమానవసతివని నిశ్చయింతు
సత్యమునువెల్లడింపుమో సాధ్వి యనిన

కం॥ హనుమంతుడు దనచేరువ
నినవంశార్ణవసుధాంశు నిగ్గతికీర్తిం
చినజానకి మోదంబున
తనవిధమునుజెప్పుబూనిఁ దమియిట్లనియెన్

చం॥ అమలచరిత్రుడౌ దశరథాఖ్యునికోడల
ధర్మమూర్తి వి
క్రమగుణగణ్యుడౌ
జనకరాజతనూజను వీరుడై పరా
క్రమమున తేజసంపద విరాజితుడై విలసిల్లు రాజచం
ద్రముడు మహానుభావుడగు
రామునిభార్యను మైథిలిన్ ధరన్

గీ॥ రాము పెండ్లాడి మమువశరథుడు గారం
బింపద్వాదశాబ్దంబులు విమలమతిని
పరగభోగంబులనుభవింపగ
త్రయోదశాబ్దమున దశరథుడుపాధ్యాయుఁడైన

చం. మునికులశేఖరుండును
ప్రమోదయుతుండు వసిష్ఠునాజ్ఞ శో
భనమెసగంగ రామునకుపట్టముగట్టదలంప కైకయన్
వనిత వరంబుగోరె గుణవంతుని రాముని కానకంపన
జ్జనపతిమూర్ఛనొందె పెలుచందనపుత్రుని కానకంపగా

గీ। తండ్రిరాజ్యము రాముడు తండ్రికిచ్చి
తమ్ముడగులక్ష్మణునితోడ తన్వియైన
నన్ను దనవెంటగొనిసన్మునుల తోడ
దండకారణ్యమందు మోదమున నుండ

ఉ. మానవమాంసభోక్త యు సమర్థుడు
దుష్టుడు రావణుండు నా
భానుకులప్రసూతులును
భవ్యవనస్కులు రామలక్ష్మణుల్
లేనితఱిన్‌హరించి యదలించుచు
నన్నొగి వచ్చి పొందగా
మానసమందు నెంచి యవమానముసేయుచున్న
డూఱునెప్పుడున్

ఆ.వె. వసుధ రెండునెలలవరకు జీవించెద
కాంతుడేగుదెంచి కావకున్న
నిజము విడచుదాననేను ప్రాణంబులు
వానరేంద్ర ధీరవర సుధీంద్ర

కం. అను సీతాంబికపలుకులు
వినిహనుమంతుండు దుఃఖపివశుండగుచున్
జనకజనునూరడింపగ
మననునందాలెంచిసారమతినిట్లనియెన్

చం నినుగన రామునానతిని నిక్కముపచ్చితి
రామదూతనై
వనధిన తిక్రమించి — గుణవంతుడు రాముడు
తత్సహోదనుం
గును కుశలంబు నిన్నిటకడంగడు
వేసనబొక్కుచుండనే
కనుగొనినాడ భావినిసుఖంబులునీకగు మత్తకాశినీ

గీ. వేదవేత్తయు ధీరుడు వీరవరుడు
నెవడు బ్రహ్మాస్త్రమును శ్రుతు లెఱుగు నట్టి
దశరథసుతుండు రాముడో తన్వి నీదు
కుశలమడిగెను మేలుజేకూర్చ నీకు

గీ॥ అతని తమ్ముడు లక్ష్మణుడతిముదమున
పుడమి సాష్టాంగవందనంబులనొనర్చి
నిన్ను బలిమిహరించిన నీచమతుల
జంపగాబూనె ప్రతిన యశంబెసంగ

క॥ అనిజెప్పుచుహనుమంతుడు
జనకజ చేరువకు నేగ జానకిభీతిన్
హనుమంతుని రావణుడని
మనమునశంకించి బెదరి మల్లడివడుచున్

ఉ. తొల్లి జనస్థానంబున కల్లరిసన్యాసిరూపుగైకొని బలిమిన్
చెల్లంబో దెచ్చితివిటు
మల్లామడినొంపనిట్లు మర్కటుమైతే

క. దనుజకులేంద్ర యివ్విధివృధా నను నారటబెట్ట నేల నా
మనము నెఱుంగవైతివి శ్రమంబగు
ధీరుడు ధర్మవేత్త రా
ముని వరపత్ని నీచమతి
మూఢమతీ నినుదాపరించు నే
వినుమనువుల్ త్యజించెద పవిత్రమతిన్
రఘురాము నెంచుచున్

కం॥ అనివెండి సీతయిట్లను
నినుజూచినసామనంబు నెటిమోదమునన్
గనుగొనగాదీపించెడి
యినవంశోత్తమునిదూతసేవని దలతున్

కం. రావణుడనినినునామది
భావింపదుమరియు ప్రీతిపాత్రంబగుటన్
ధీవర రామునిగుణములు
నీవలనన్వినదలంతు నిరుపమతేజా

మ. అనినన్ దోయిలియొగ్గివాయుసుతు
డత్యానందముంజెందియి
ట్లనుఁ దల్లీభవదీయసత్కరుణ
దివ్యశ్రేణికీర్తింపనో
ప్పినశ్రీరాముని సద్గుణాఢ్యుని
దయాబ్ధిన్ భక్తికీర్తించుభా
గ్యనిధానంబులభించె ధన్యుడను
నాకర్ణింపుమాసక్తితోఁ

సీ. రవికన్న మిన్నవిరాజిలుకాంతిని
కుముదబాంధవువలెన్ గూర్చుహాయి
రాజరాజునుమించు రాజేంద్రుఁడాతడు
విక్రమంబునమించు విష్ణుదేవు
నలబుద్ధిగెలుచుబృహస్పతిన్
జెలువమునందుమన్మథునోంచు నతిమనోహ
రుండుఁగణింప ధీరుండు
తేజస్వంతుడమితబలుండు మహారథుండు

గీ. యుక్తవిషయంబులనుకోపమొందు
నతని కినుకవ్యర్థముగాదు యొక్కింతయేని
చారునయనాభిరాముడు సద్గుణుడును
రమ్యగాత్రుడు దశరథరాముడతిప

మ. త్వర యుద్ధంబున నస్త్రశస్త్రములనిద్దైత్యాధముంజంప ని
ష్ఫురికేతెంచును విశ్వసింపుమననున్ పూబోణి నేసీదుకిం
కరుడన్ పుత్రుడ రామదూతను
భవత్కారుణ్యపాత్రుండ వా
నరుడన్ నిక్కముజెప్పుచుంటి
నమితానందంబగున్ నీకిలన్

ఉ. నీతివిదుండు శౌర్యముననిర్జరనాథునిసాటివచ్చు వి
ఖ్యాతచరిత్రుడున్ సమరమందున
నోటమిలేనియట్టి వి
జ్ఞాతుడునైనలక్ష్మణుడు సమ్మతినీకునమస్కరించి-నీ
భీతినకంప రక్కసులపీచమడంపగనుండె సిద్ధమై

కం। అనినన్ జానకి హనుమంతునకిట్లనె
నీకురాముతోసఖ్యము నెం
దొనగూడె రామలక్ష్మణులనుజూచితివెందు
వారలకుకుశలంబే

కం॥ నీతీరుంగన రామునిదూతవు
సద్గుణుఁడవనుచు దోచెనుమదిని
ప్రీతినిజెప్పుము రాముండా తనితమ్మునకు
గలిగినట్టిగుణతులన్

కం. అవయవములసౌందర్యము
ప్రవచింపుము నీవుజెప్ప రాముని రూపం
బవగతమగు నాకించెద
వివరింపుము లక్ష్మణాఖ్య విధమెట్లుండున్

కం అనవుడు నాహనుమంతుడు
జనకజకున్ మ్రొక్కి సత్యసంధుడు శ్రీరా
మునివర్ణించెద శ్రద్ధనువినుమమ్మాయనుచు
నిట్లువివరించె వెసన్

మ. వినయాన్వితుడుకంబుకంఠుడు
ధనుర్వేదంబుసర్వంబునే
ర్చినసూరుండును.
బుద్ధిగీష్పతినికీర్తినిచక్రికిన్‌సాటి-కాం
తినిసప్తాశ్వనిబోలు,
వేదవిదుడున్‌ధీరుండు నారామచం
ద్రునిసౌందర్యము విశ్వరంజితము
సత్యార్థస్వలుండారయన్

గీ. మెఱపుతీగనుగూడినమేఘమట్లు
శ్యామలాకారుడగుచు తేజంబుసెనసి
మురిసిపడుచుండు శ్రీరామమూర్తితనువు
భద్రగుణుడును నాజానుబాహుండతడు

కం॥ శ్రీరామునికంఠధ్వని,
భేరీరవమట్లునొప్పు ప్రియకరుండై శో
భావతిని ముజ్జగమ్ముల
నారామునికీర్తి వెలయు నతిసుందరమై

గీ. కంఠమందునమూడురేఖలుజెలంగు
పిడికిలియు ఱొమ్ము మణికట్టు పెనుదృఢంబు
నాభియును కంఠపుంధ్వని
నడకతీరు దోచుగంభీరమున మహాత్ముడనిఁజాటు

౯. కరములు మోము నాలుకయు
కన్నులు దౌడలు గోళ్ళు పాదముల్
సరసిజముల్ లలాటమును
జానువులున్ పిఱుదుల్ బృహత్త్వమం
బరయ మహానుభావుడనిసంతట
నేమివచింపగావలెన్
సరసుడు సాధుసత్తముడు
సద్గుణధుర్యుడు రాముడంగనా

౧౦॥ తొంబదియారంగుళముల్
కంబుగ్రీవుండునైన కాకుత్స్థునిదే
హంబౌన్నత్యము వినుమో
యంబుజదళనేత్రనీవు నాప్యాయమునన్

గీ. సత్యధర్మములందునాసక్తిగలిగి
సంపదగడించి దానియాచకులకిచ్చు
దేశకాలపాత్రత్వముదెలిసినదక్షు
ప్రియముగామాటలాడు నొప్పింపడెపుడు

ఉ. అన్నకుసాటిలక్ష్మణుడు
నన్నిగుణంబులనెంచగా సదా
ర్వన్నెలకాంతినొప్పెడి సువర్ణపుఛాయనెనంగుదేహనం
పన్నుడు విక్రమాఢ్యుడు కృపన్
హితకోటినినాదరించు వి
ద్వన్నుతుడార్తరక్షణుడు
వాడిమిసూర్యునిబోలు నమ్మరో

కం. పురుషోత్తమలక్షణముల్
నరసిజనేత్రునకుగలవు సౌందర్యమునన్
సరివచ్చుమన్మధునకున్
పరమాప్తుండతడు దీనపాలనుడమ్మా

గీ॥ దురితమతి రావణుడునిన్నుదొంగిలింప
రామలక్ష్మణులంత నరణ్యమందు
వెదకుచున్నను వీరుడు వృద్ధుడైన
నమితబలుడు జటాయువునరసినంత

చం. నినుదనుజాధముండునవినీతిహరించుట
వానితోయశం
బెనయరణంబొనర్చి
యతడిమ్మహిగూలితినంచుజెప్పి వే
దనమరణింప శోకమునతమ్మునితో
రఘురామచంద్రుడా
తనితనువుందహించి కలతన్
నినురోయును ఋశ్యమూకమున్

కం॥ వడిజేరిన సుగ్రీవుడు
కడు దైన్యము నొనయ మేనకంపింపగ నే
ర్పడ నన్ను జూచి యిట్లనె
గడుసుదనంబూని వాలిగర్వోద్ధతుడై

కం. ఈవచ్చువీరవర్యుల
భావింపగనన్ను జంపబంపెను నాకీ
ధీవరులంబరికింపగ
దేవతలీరీతిభువికి దిగిరనిదలతున్

కం. రవిచంద్రులట్లుకాంతిని
వివరింపగవెలుగు వీరివిధమెఱుగుటకై
పవమానతనయునీ వె
జవమునజనుమనిన రామచంద్రునికడకున్

గీ. ఏగి రాముపాదంబులకెఱగిభక్తి
లక్ష్మణుడు జెప్పవింటి నోలలననిన్ను
రావణుడుదొంగిలించుట
రాము విరహ వేదనయు భాస్కరాత్మజు వేదనయును

.వె. ఒక్కరూపుయగుటు
నొగివారికిన్ స్నేహమయ్యె నింద్రపుత్రుడైన వాలి
నాజిజంపి రాముడర్కజు వానరరాజ్యమునకుజేసె
ప్రభుని పిదప

కం॥ రావణుడుబలిమినొొొసైని
పోవంగానీదు మేనిభూషణముల్ ను
గ్రీవుండుందుగిరీంద్రముపైవిడిచిన
వానిదాచి భానుజుఁడంతన్

కం॥ రాముసకుంగనబఱచిన
నామహి మాన్వితుడు వానివారసి దేవీ
హా మైథిలి సీతా యనిభూమింబడ
లక్ష్మణుండుఁ బొగులుచు మదిలో

గీ॥ అగ్రజునిదేర్చి యోదార్చి యంతమీద
సూర్యతనయుసుగ్రీవుని శోభితాంగు
నతిరయంబున వైదేహినరయకపుల
బంపుమనిప్రోత్సహించిన ప్రమదమొదవ

కం. ఘనుగోల్పోయినరాజ్యము
తనభార్యనురక్తిబొందె తరణిజుడంతన్
నినువెదకగవానరులకా
జననీబంపించె ధైర్యశౌర్యోజ్జ్వలలన్

గీ॥ వానరశ్రేష్ఠుడున్ ధీరవర్తనుడును
వాలిసుతుడంగదుడు నిన్నువాసివెదక
దక్షిణపుదెసకేతెంచె ధైర్యధనులు
విక్రమాన్వితులగుకపుల్ వెంటనడువ

కం॥ మహినడవుల శైలంబుల
గుహలన్ శోధించి బలముగోల్పడి మదిని
స్పృహజెందిజూపనుండగ
సుహృదుడు సంపాతి మాకుజూపెంద్రోవన్

కం. అతడు జటాయువుకగ్రజు
డతులితశౌర్యాన్వితుండు ననుజుడు దర్పో
న్నతుడైనరావణునిచే
క్షితిగూలుటనాలకించి చేడ్పడుచుమదిన్

కం॥ లంకామార్గముదెలిపిన
సంకోచమునొందికపులుజలధినిదాటన్
జంకిన నమితజవంబున
పంకజదళనేత్ర నేనుపవనుని రీతిన్

కం॥ శతయోజనవిస్తీర్ణము
నతివీచిసంయుతమును నహీనక్రఝషా
న్వితమగునంభోనిధి వెస
ధృతిమీరన్దాటివచ్చి దిటవుగలంకన్

గీ॥ చొచ్చి యంతఃపురంబుల
సుందరమగుసౌధముల దోటలందు ప్రాసాదములను
చైత్యములనెల్ల గాలించి సాధ్విసన్ను
చివరకిచ్చోటకనుగొంటి శ్రేయమొదవ

చం. వననిధిదాటివచ్చి బలవంతుడు రాముఁడు
లక్ష్మణుండు శౌ
ర్యనిధులు వానరోత్తములు సర్కిలి
సాయముజేయ లంకకున్
గొనకొనివచ్చి రావణునిగూల్చి
సహోదరపుత్రమిత్రబం
ధునికరమెంచ శీఘ్రమున తోయజగంధి
భయంబువీడుమా

గీ. నీదుసేమముప్రశ్నించె నీవిభుండు
భానుజుడు లక్ష్మణుండును పరమభక్తి
నీకుమ్రొక్కిరి రామాజ్ఞనిన్నుజూడ
వచ్చితిని నిక్కమమ్మ రావణుఁడగాను

మ॥ అరవిందాక్షుడు పీనవక్షుడు
కృపాధ్యక్షుండు పుణ్యప్రదుం
డరయన్ ధీరుడు కంబుకంధరుడు
మనోహారుండు సత్యవ్రతా
చరణుండున్ మహిమోజ్జ్వలుండు
జలదశ్యాముండు నీకాంతుఁడో
తరుణీ నీవిరహంబుచేఁ దినచింతన్ దీనుడై బొక్కెడిన్

గీ. అగ్నిహోత్రగృహంబు గృహ్యాగ్నివలన
తాపమొందెడిరీతి భూధ్రము ధరిత్రి
కంపనమున చలించెడిగతి లతాంగి
నిన్నుబాసితపించెడి నీవిభుఁడు

గీ. వానరశ్రేష్ఠుడున్ ధీరవర్తనుడును
కీర్తనీయుడు సుగుణుడు కేసరియన
నలరు విక్రముడాతని కంగనయగు
నంజనాదేవికేను విఖ్యాతిమీర

కం, అనిలునివరమునబుట్టితి
హనుమంతుండండ్రు నన్ను నవనిన్ సుగ్రీ
వునిమిత్రుడ నీదాసుడ
జననీవివరింప రామచంద్రునిదూతన్

కం. కలవిధమెల్లంజెప్పితి
కలతంబడనేలమదిని కడుశుభములున
గ్గలమగు నందిచు మేలా
కలికీరామాంగుళీయకంబిదె గొనుమా

గీ. రామనామాంకితంబునై కోమలాంగి
ప్రకటమైయొప్పు దీనినమ్మకముగలుగ
నీకుగాఁదెచ్చితి న్నమోవాకములను
భక్తినర్పింతుగొనుము యాసక్తితోడ

కం. అనిశ్రీరామునిముద్రిక
హనుమంతుండీయ జనకజాత్మజదానిన్
గొని లజ్జావనతయునై
తనవిభునింజూచినట్లు దలచుచుమదిలో

కం. ఎన్నాళ్ళకు నినుజూచితి
కన్నుల-నాభర్తవేల కమనీయముగా
జెన్నొందితి విన్నాళ్ళును
నన్నున దేర్పంగవచ్చినావిటకిప్డున్

కం. అనిమురియుచు నాజానకి
హనుమంతునిజూచియిట్టులనె నోయన్నా
వినుతించెద నీశౌర్యము
ననుపమవిక్రమముడవీవు నదియెట్లన్నన్

కం శతయోజనవిస్తీర్ణా
న్వితమగున భోధిదాటి వెననీలంకన్
ధృతిజొచ్చుటకు వరివశమగు
స్తుతిపాత్రుడవీవు నాదుదుఃఖంబడగెన్

మ॥ పరమానందకరుల్ రఘూద్వహులకున్
భద్రంబె నాదుఃఖమే
కరణిన్‌దీర్పదలంచె ధీవరులసఖ్యంబూనెనా సిన్నునా
పరితాపంబునడంపబంపెనొకో
నాపైకూర్మి నీరావణున్
పరిమార్పంగదలంచునో దలపడో
ప్రాణేశుడున్ జెప్పుమా

కం. నీవిక్రమము పెఱుంగక
నీవిధిపుత్రుండుమనొక్కొ యెంచగ నీవి
రావణుసెక్కసేయక
ధీవరయుప్పురముసందు దిరిగితివి బలే

గీ. సర్వభూతభయంకరశా స్త్రకుడును
విక్రమోద్ధతుడున్ దైత్యవీరుఁడైన
రావణునిగెల్వజాలు పరాక్రముడవు
నయుచు నినుజూడఁదోచె సత్యముకపీంద్ర

గీ. సర్వశక్తిసంపన్నుడు శస్త్రవేత్త
రణమునన్వజ్రిసేని తిరస్కరించు
నట్టివీరుడు శ్రీరాముఁడసురదౌర
నన్నపహరింపనెట్లు మౌనంబునూనె

కం. నిరహంకారుడు శూరుడు
శరణాగతవత్సలుండు శాత్రవునిన్ దు
శ్చరితునిజంపకుపేక్షన
కరుణించుటనేమనందు కర్మముగాకఁ

శా. శ్రీమంతుండు పరాక్రమాఢ్యుడగు
సుగ్రీవుడుమిత్రుండునై
రామాజ్ఞన్వినయంబునన్ మెలగునే
రమ్యాననుండున్ యశో
ద్దాముండున్ మహిమోన్నతుండగు
సుమిత్రాపుత్రుడౌలక్ష్మణుం
డేమాడిక్కన్జరియించు
మీాకపులుమాకింపున్ బ్రసాదింతురే

శా. కౌసల్యా భరతుల్ సుమిత్ర యు
శుభాకారుండు శత్రుఘ్నుడున్
వాసిన్ మోదమునంజరించెదరె
యవ్వార్తల్ వినన్వచ్చునే
యాసల్ కృంగిదపించు
మాకుభరతుండానందముంగూర్పను
ద్యాసిత్వంబునసైన్యమంపి
జయముత్పాదింపజేయుంగదా

ఉ. రాముడు, దుష్టబుద్ధియగురావణునింజరిమార్చి నాకు-గా
రాముచమేలుగూర్చ
మందిర క్రిదలంచునె జెప్పుమన్న - నా
ప్రేమమతన్ స్మరించునెన్నృపాలుడు,
సల్యమెఱుంగుదేని - నా
స్వామినిమిత్తమై
నిలుపజాలుదుకాయమునందుప్రాణముల్

ఆ.వె. బంధుపుత్రమిత్రపరివారయుతముగా
రావణాఖ్య పాపరతునిజంప
ననుజుతోడగూడి యరుదెంచునాయేమి
రాముడీనగరికి రాజసమున

చం॥ అనిన దయామయుండును
మహోద్భుతవిక్రమవర్యుడైన ధీ
వినుతుడు వాయునందనుడు
వేడ్కశిరంబునువంచిమ్రొక్కి యిట్లను హరిణాక్షి
నీవిధము నారయురాముడెఱుంగకున్కి యి
ద్దనుజును పేక్షజేసె సముదంబునజంపక
నింతకాలముల్

కం॥ వరపర్ణిని నీయీడశ
త్వరరామునితోడజెప్ప తక్షణమే వా
నరులకు దోడ్పడ రాముడు
నరుదెంచును దైత్యవరులనాజింజంపన్

గీ. అసురులేగాని గమనింపనమరులైన
సమరమందున నిర్జించుశక్తిలేదు
రామచంద్రుని-శీఘ్రమేరాక్షసేంద్రు
జంపి నిన్గొనిపోవునెంచగ నిజంబు

సీ. పరికింపగా నిన్ను బాసినదాదియా
మనుజేంద్రుడును దైన్యమతి గృశించు
నెవ్వరోదార్చిన నెల్లవేళలనిన్ను
స్మరియించు జానకీ! మైథిలి యని
దుఃఖించుచుండు నీదుర్దశ చింతించు,
కొలది దినంబులు కూర్మినీవు
నాకపృష్ఠంబపైనను నొప్పునింద్రుని
గతినొప్పురాముని కనులజూచు

గీ. కాలమేతెంచె గడచెదుఃఖపుదినములు
పరగపతులను సుతులనుబాసియేడ్చు
యసురవనితలజూచెద వతిముదమున
తడవులేదింక నామాటతథ్యమమ్మ

గీ॥ రామనామాంకితములు తీవ్రతరమగుచు
పావకనిభాస్త్రములుయిటన్ ప్రజ్వలింప
జూచెదవుగాక నీకగుశోభనములు
నమ్ముమోతల్లి నావచనములనీవు

గీ. అనివనిట్లనుజానకి
యగచరేంద్ర రావణుండేమొ నంవత్సరంబునాకు
నిర్ణయించెనుమితి దీరెనేటితోడ
మాసములుపది నిక రెండుమాసములకు

ఆ.వె. గడువుతీరిపోవుఁగానజీవింపను
మీద నేను శీఘ్రమేరఘూద్వ
హుండ వచ్చునట్లు లోనరింపుమిచటకు
వానరులనుగూడి వాయుపుత్ర!

కం॥ దేవేంద్రునిబలము
శచీదేవిగ్రహించినవిధంబు తేజస్వంతుం
డౌ విక్రమాఢ్యురాముని
చేవయెఱుంగుదునునేను చేడ్పడనేలా

కం జలజాప్తుడుకిరణంబుల
జలమునుశోషింపజేయుచందమున మొ
క్కలమున దైత్యులనందరఁ
దలపంగారాముడస్త్రపం క్తింజంపున్

కం. అనికన్నులనీరొలుకగ
జనకజదనఃఖనిడలచి సమ్మానమునన్
వినుతించుచు దుఃఖమ్మున
వినమితమైయూరకుండ వినయాన్వితుడై

కం. హనుమంతుండిట్లనియెన్
మనమునబొగులంగనేల మాతా! నాపీ
పున నెక్కుదేని రయమున
నినుజేర్చెదనురలుఁ బొగడ నీవిభుకడకున్

౹. ప్రేల్వబడినహావిష్యము
వీతహో్త్రుడి ్రదునకొసంగునట్లు నిన్నింపుమీర
ప్రసనవణగిరినున్నట్టి రామచంద్రు
చెంతజేర్చెదవనువిశ్వసింపుమమ్మ

౹౹ కూర్మి రోహిణిచంద్రునిగూడినట్లు
నీవునావీపుపైనెక్కి నిర్భయమున
రమ్ము రామునిగూడ
పుత్రకుడనేను సందియంబేలనీకు నిశ్చయము తల్లి

౹౹౹ అనిహనుమంతుడు వలికిన
జనకజయిట్లనియె నన్నుసత్వరమే రా
మునిజేర్తునెదు కోతివి
ననుబహుదూరంబు నీవునన్మోయంగా

౹. నీకుదరంబె యల్పుడవు
నీదగుభక్తికి మెచ్చువచ్చెనాన్
లోకువగాదలంచి
మదిలోహనుమంతుడుఖేదమొంది నా
ప్రాకటశౌర్యధైర్యములు
భామినిదానునెఱుంగలేక నే
డీకరణిన్ భయంబునువహించెదు
జూపెదనాస్వరూపమున్

. మదినినిల్పి యాహనుమంతుడంత్తే
పర్వతాకారుడై యత్రభీషణము నంత
వజ్రనఖవజ్రదంష్ట్రల వహ్నివోలె
తీక్ష్ణవదనుండునై యొప్పి ధృతిజెలంగి

ఆ వె. ప్రళయకాలరుద్రుభంగి భీమంబునై
తామ్రవర్ణకుపిత తపనునట్లు
జలనిధులుదలంప జానందఘ్నంబునై
యొప్పె వాయుపుత్రుడువిదజూడ

కం. జనకజకుమ్రొక్కి యిట్లను
హనుమంతుడు దివిజులెల్లనబ్బురమొందన్
దనుజసమేతముగాలంకి
కనుకనుగొనపెల్లగించి కలిపెదవార్ధిన్

కం. ప్రాకారతోరణమ్ముల
నాకరమైయ్యద్రికాననాన్వితమై సు
శ్రీకరమగు లంకాపుర
మూకర్షణపెల్లగింతు నసురులుబెగడన్

గీ. పద్మపత్రవిశాలాక్షి పావనాంగి
యైనజానకి హనుమంతుసరసి యిట్లు
లనియె నీశక్తివిక్రమమద్భుతమ్ము
తరమెనినువినుతింపవిధాతృకైన

గీ. వేయిసూర్యులుకాంతిఁ వెలిగినట్లు
తేజమునవొప్పు నినునన్నుతింపదరమె
వానరవరాహాఘోటకమైన తేయ
గారసింహముఖంబులెన్నగ ధరించి

వె. పంచవక్త్రుడైన
పరమేశ్వరునిరీతి శోభనొప్పునిన్ను జూడజాల
నొనరనీదురూపముజ్జగింపుము
కాంతనగుట నీదుతల్లిననిదలంచి

గీ. అనుచుబ్రార్థింప హనుమంతుడాదరించి
తొల్లిఁగలరూపుదాల్చిన తోయజాక్షి
మెచ్చి యవ్వానరేంద్రుని మీదయిట్టు
లనియెనామాటవినుము మహానుభావ

ఉ. భూరమణుండు ధీరుడును
పూతచరిత్రుడు సద్గుణాన్వితో
దారుడు రామచంద్రుడు
ముదంబొనగూర్పగనిన్నుబంపె న
న్నారయ నీదుశౌర్యము
మహాద్భుతమంమదలంచెదన్ మదిన్
మారుతతుల్యవేగుఁడవు
మానితకీర్తివి మారుతాత్మజా

ఉ. నీవుమహోజవంబునగణింపగ
నన్గానవోవువేళ - దు
ర్భావనరావణుండు నినుబట్టగ
శూరులునైన దైత్యులన్
జీవదలిర్పగా - ముదలజేసిన
వారికినీకుయుద్ధమౌ
పావని దానజేటొదవు పొర్థిపుఁగ్రహమొందు నీవయిన్

మ. బలవంతుండగుటన్ నిశాచరులదర్పంబెల్ల మాయింప ను
జ్జ్వలవృత్తిన్ గొమరారుశౌర్యగుణవిస్ఫారత్వముంగల్గినన్
దలపంభీతినినంబుధింబడుదు
సత్యం బేచు నస్త్రైనన
గ్గలమైనట్టి భవత్ప్రయత్నము వృథా
గర్హింపరే యెల్లరున్

గీ. నీవుననుగొనిపోవుట
నీచులైన రాక్షసులు జూచిరేని పరాక్రమించి
యుద్ధమొనరింతు వారలాయుద్ధమందు
విజయమే రివరించునో విశ్రుతమన

కం॥ రణమునవిజయంబొదవిన
ప్రణుతింపందగును మరిపరాజయమగుచో
గుణవంతులునిందింపరె
గణనీయముగాదుచెఱుపుగలుగు కపీంద్రా

ఉ. నీవుమహాప్రసిద్ధుడవనింద్యచరిత్రుడవీవు పూనినన్
రావణుడాదిరక్కసుల రౌద్రమునంబరిమార్చునట్టి శౌ
ర్యావిలసత్ప్రపూర్ణుడవునైనను
రామునికీర్తి డిందునం
చేవినుచాలిపుత్రి మది చింతయుఁగుండెద
శాంతినొందుమా

ఉ. వీరరసావతారుడు పవిత్రగుణంబులనొప్పువాడు దు
ర్వారపరాక్రమాన్వితుడు
రాముడు రాజకులైకభూషణుం
డారయ వానినాజిరణమందుజయింపగశక్యమౌనె బృం
దారకబృందమైనవిదితంబుగ —
దైత్యులనేలనెప్పగన్

కం॥ నీవేగిరామచంద్రుని
ధీవరులక్ష్మణుని కపుల దినకరసుతునిన్
రావణునిజంప శీఘ్రము
గావాయుజతోడి తెమ్ము కడుమోదమునన్

గి. రామవిరహంబునన్
దివారాత్రములనుమదిదపించెడినాకు సేమమునుగూర్ప
రమణుడగురాముదోడ్కొనిరమ్మిచటకు
విశ్వవినుత మహావీర విపులతేజ

ఉ. రామునిదక్క నన్యునమరన్
స్పృశియింపగనోపనేను నా
నేమమతిక్రమింపదగునే —
రజనీచరుడెంచనాడు నా
స్వామినిబాసి నేపరవశంబున
దుఃఖమునొందుచుండ గా
తామనవృత్తిదెచ్చె నదితప్పగునే
మహాత్మ జెప్పుమా

వె. వేయిమాటలేల
వేగమేరామలక్ష్మణులదోడితెమ్ము మంగళాంగు
డైన రాముజూడ నడగునాదుఃఖము
ననిన సీతకిట్టులనియెహనుమ

ఉ. మెచ్చితినమ్మనీగుణము
మేలగు రావణునిఁగావధింపగా
జెచ్చెర రామలక్ష్మణులజేర్చెదలంకకు
విశ్వసింపుమా
పొచ్చెములేదుసుంతయు
విభుండుముదంబొనగూర్చు నెంచగా
వచ్చెవినాశకాలముధ్రువంబుగ
దైత్యులకోసుహాసినీ

గీ. సాధ్వికిన్ యుక్తమైనట్టిచందమిదియ
వాస్తవము కోమలాంగులవశమెనూఱు
యోజనంబులనొప్పెడి యుదధిదాటు
కోతివీపునవెక్కి చిక్కులునుగలుగు

గీ. రామునిందక్క నన్యచరణమునైనఁ
దాకననినీవుచెప్ప సంతసమునయ్యె
రామపత్నికినిట్టులర్హమ పలుకగ
దాశరథికేను నీదుచందముదెలిపెద

కం॥ ఉరివోసుకొనఁదలంచుట
దురితమతిన్‌రావణుండుదూఱుట నీవా
సురశత్రునినిందించుట
పరగన్ వివరింతునమ్మ పార్థివుతోడన్

గీ. అంబునిధిదాటి లంకకేనరుగుదెంచి
నిన్నుజూచిభాషించుట నీవిధంబు
నెఱుకసేయ నభిజ్ఞానమేదియేని
తల్లినాకిమ్ము రామభూధవునకొసఁగ

కం. ఆపదుఃఖంబున జానకి
హనుమంతునకిట్టులనియె నగచరవర్యా
విను చిత్రకూటశైలంబున
సిద్ధాశ్రమమునందు పూర్వమొకపరిన్

కం. నాయంకమందు రాముడు
హాయిగ నిద్రించుచుండ నాసమయమునన్
వాయసము వచ్చి ఱింగున
నాయితమతిబలిమి నాకుచాంతరమందున్

గీ॥ చండతుండాగ్రమున గీఱుచుండ
దానిద్రోలినన్ పోకనయ్యది లీలనెగసి
మాటిమాటికి బొడువ నారాటమొంది
వ్యథితమతినేడ్వ నాదశరథసుతుండు

గీ॥ నిదురమేల్కాంచి నాదుకన్నీరుదుడిచి
కాకనఖరేఖరక్తసిక్తంబునైన
నాస్తనంబు సుజూచి విన్నదనమొంది
యెవ్వడీకృతిబాధించె నింతినిన్ను

చం. వదినెఱిగింపుమంచు
బలవంతము సేయుచునుండు వేళ నా
కడకరుదెంచు కాకిని వగన్
భయమొందెడు నన్నుజూచి యా
గ్రడుసరి కాకినిందుచుమగా
కుశ కేలనుద్రుంచి దానిపై
విడచె పితామహాస్త్రమున వేడుక
దానభిమంత్రితంబుగా

ఉ. ఆకుశ మందుచున్న ప్రళయాగ్నివలెన్
గడుదీప్తినొప్పుచున్
కాకినిఁజంపగాదఱుమ
కాకము భీతినిబాఱి యింద్రునిన్
లోకశరణ్యగావుమని లొగ్గడిలన్
బురుహూతుడున్భయం
బాకులవృత్తి దానికిసహాయమొనర్పక
మిన్నకుండినన్

గీ. సర్వలోకములావాయసముచరించి
కాచువారెవ్వరునులేక కలతనొంది
వినతిరామునిశరణము వేడ నతడు
దానికుడికంటినిహరించిదయనుఁగాచె

గీ॥ కాకి బ్రహ్మాస్త్రమున కుడికన్ను పోవ
రామునకు సర్వలోకశరణ్యునకును
మ్రొక్కి దశరథునకు మ్రొక్కి
మోదమతిని సత్వరంబునజనె నిజస్థానమునకు

కం॥ ఘనునల్పపుపక్షిపయిన్
వేసుబః బ్రహ్మాస్త్రమీవు విడువవె నేడీ
[illegible] కానిజంపకవిడచుట
జన నీ [illegible] ర్యాన్వితుడవు సర్గ జధుర్యా

వ. నినుమదినమ్మినట్టిసతి
నిన్నుస్మరించుచున్దైన్యవృత్తిని
దనుజుల చేవగంగుముల
ధైర్యపరాక్రమశోభితుండవై
ననుభవదీయదాసిని
విన్రమయుతన్జనుసేయుపేక్ష సే
యను మహాత్మయంచు
ననిలాత్మజ రామునితోడజెప్పుమా

ఉ. రామునితోడజెప్పుము
పరాక్రమవర్యకపీంద్రనీవు నీ
కోమలి నీదురాకమదిగోరి
దురాత్ములు దుష్టరాక్షసుల్
బ్రామిడి నిష్ఠురోక్తులనిరంతరముంగడునొవ్వజేయ నీ
పైమమతన్ శరీరమున్ప్రాణములన్నిటిపెన్ గణింపగా

ఉ. నీవనితన్హరించియవినీతిని
రాజ్యమునేలుచున్న యీ
రావణు బంధుపుత్రహిత
భ్రాతృసమేతముగావధించి - భూ
దేవతలున్ సుపర్వులు నుతింపగ
కీర్తినిగొమ్ము లేనిచో
జీవితమందుఁజూడవిక సీతను
సత్యముసుమ్మురాఘవా

కం॥ నేనొక మానమునిల్పెద
మేనునఁ బ్రాణంబులంతమీద మహాత్మా
వానరవర-జచ్చెదనని
పూనికవచియింపుమీవభూనాథునితోన్

గీ॥ ధైర్యమున వైనతేయునిశౌర్యమందు
సూర్యునిన్ బోలెదీవుగాంభీర్యమునకు
నర్ణవముసాటిరిపుల నుదీర్ణశక్తి
జంపకమహాత్మనీ కుపేక్షింపనగునె

చం. ననుఁదనతల్లియట్లుసుమనంబున
జూచెడువాడు రాముని
జనకునిరీతినెంచియనిశంబుప
దార్చనసేయువాడు శాం
తనిధియుగొప్పవాడు
ప్రియదర్శనుడున్ గపటంబులేని స
జ్జనచరితుండురాము
సహజన్ముని లక్ష్మణునిన్ బ్రియ బునన్

గీ. క్షేమమునఁగూర్చినీవు
యీసీతయడిగినట్లు దెలుపుము ధర్మాత్ముడనియశంబుఁ
గొనినరామునిపదములకున్ నభక్తి
నెఱగెనీసతియని జెప్పుమీవరక్తి

కం. దనుజులునవమానింపగ
మనమునశోకించుసీదుమగువను శీఘ్రం
బునవక్షింపన్ ధర్మం
బనినీప్రియకాంతపలికెనని జెప్పవలెన్

కం॥ అనితనపయ్యెదకొంగున
జనకజగట్టుకొని యున్న సత్కృతిభాగ్యం
బునునగుచూడామణి
యూహనుమంతునిచేతికొసగి యనురీతిన్

గీ. నావివాహకాలంబున నాదుజనని
ప్రీతినిదియిచ్చె దీనినా పెనిమిటియగు
రాముడుంజూచెనేని దుర్దశతపించు
నన్ను నీజూచి నట్లుమన్న నదలంచు

కం. అనిజెప్పంగుములుసీతను
హనుమంతుండూరడించి యతిభక్తిని గైం
కొనిచూడామణినిట్లును
జననీనాకాజ్ఞనిమ్ము సరగుననేగన్

కం॥ యమునేనియు రవినేనియు
నమలాధిపునేని యుద్ధమందునజంపన్
రమణీదక్షుడు నీవిభుడమరారులజంపు టెంత
యతడలిగినచో

మ॥ బలసంపద్విభవాన్వితుండను
యశఃప్రఖ్యాతశౌర్యప్రభా
జ్వాలనుండున్
కపిరాజచంద్రముడునైవర్ధిల్లు సుగ్రీవుడో
కలికీ వానరసైన్యముల్ గొలువ
లంకంజొచ్చి యీరాక్షసా
వలిజెండాడి భవత్ప్రమోదకరుడౌ
వందింప వేయేటికిన్

శా. ధైర్యోత్సాహసమన్వితుల్
బలయుతుల్ దర్పప్రభాభాసితుల్
శౌర్యాగ్నిప్రతిమానతేజులు
నభస్సంచారులున్ సాహసౌ
దార్యోపేతులు ఋక్షవానరులు
దైత్యశ్రేణిమర్దింపగా
పర్యాప్తమ్మునవత్తురిప్పరికి
నీప్రాణేశునాజ్ఞన్వడిన్

గీ॥ వానరులనన్ను మించినవారు మరియు
నాసములు కోట్లసంఖ్యనున్నారు వారు
దనుజులనుజంపి రామభూధవుననుజ్ఞ
నిన్నురక్షింపప్రతినబూనెదరు తల్లి

కం॥ అనిహనుచూడామణిఁగైకొని
జనకజకున్ మ్రొక్కి వెడలుసమయంబున నా
జనకజ వెండియునిట్లను
హనుమంతునితోడ శుభములగునాంక్షిపై

కం. తిలకమొకమారుచెదరిన
తలపన్ మణిశిలనుసమ్ముదంబుననుదుటన్
తిలకముగదిద్దిరాముడు
కలకలమనినవ్వి నన్ను కౌగిటదేర్చెన్

కం. ఈవిషయంబును[illegible]కుము
నావి[illegible]కుగ[illegible]తుగాగ ననుగాపాడన్
రావణునిజంప లంకకు
నీవేగొనిరమ్ము రామునిన్ లక్ష్మణునిన్

ఆ.వె. అనిన సీతకెఱిఁగి యంజనీపుత్రుడు
నాస్థలంబుఁ బీడి యవలకేగి
దనమనంబునందుఁ దలచె
నిప్పుడిరాము నాజ్ఞ లంకఁ జొచ్చి యతనిపతిని

కం॥ కనుగొంటి మాటలాడితి
జనకజనోదార్చితింక సందేశంబున్
వినిపింపరాముచెంతకు జనియెదనిక
రావణాఖ్యుచ దమెఱిగెదన్

గీ. సామదానభేదమ్ము లెంచగదయ్యజించి
దనుజులనుదెచ్చగొట్టగా దండమెదగు
బలముచేక్రొవ్వి మహిమిట్టిపడుచున్న
దశముఖునితీరెఱింగి మోదమునబోదు

ఉ. రావణుశక్తియుక్తులు పరాక్రమమున్
జవిఁజూచివోదు సు
గ్రీవునిచెంతకేను నిజకీర్తికరంబును
యుక్తమే యహం
భావులు ధూర్తవర్తనులు
పాతకులైన నిశాచరాళినిఁ
దీవినడంచి రావణుడు
డీల్పడ నిప్పుడువిక్రమించెదన్

కం. తనకాజ్ఞాపింపంబడు
పనియొక్కటెగాక పెక్కుపనులవలీలన్
సునిశితమతినెరవేర్చుట
జనుదూతకు నట్టివాడునమ్మానితుడౌ

గీ. రామునానతి లంకాపురంబుజొచ్చి
చూచితినిగత్రికిసీత నిచ్చోటదీన
నేమిఫలము నేనిస్థానవేంద్రుబలము
నిశ్చయించుటలెస్స గణింపనిపుడు

గీ॥ కపులశక్తియు మరియురాక్షసులశక్తి
యందుగలతారతమ్యములరసి మీద
రావణునిపాలనము సమర్థతనుజూచి
యరుగుదునుగాక కిష్కింధకధిపుడుబ్బ.

ఉ. రావణుశౌర్యముందెలియ
రమ్యమునై విలసిల్లు నీయశో
కావనమందువృక్షముల
కంపమునొందగ రాక్షసాళి మో
దావహవృత్తినేటిచి
యద్భుతవిక్రమకేళివిస్ఫురిన్
సేవచరింతు దుర్మతినిదీకొనువారి
వధించుచున్ వెసన్

కం. ఈవనమందలి వృక్షము
లేవిరువన్రావణుండు నెంతయుకోపం
బావహిలన్ దనుజాళిని
కావరమునన్నుబట్టగా బంపించున్

కం॥ తనబలము నాబలంబును
గమనింపక దైత్యులంతకాకారులునై
సమరంబొనరింతురు
సేనమురారుపద్రుంచి విఖ్యాతబ్బురమందన్

చం. సురలజయించిగర్వము చ
సొంపిలు రావణుఁడీవిదర్పమే
నరసి హితార్థకోటి విధమగ్గలికమ్మునెట్టింసి రామభూ
వరునిపరాక్రమప్రకటము
వర్తనమేనెట్టిఁంచి రావణుం
డెరయగధిక్కరించి వడియేగెద
రామునిచెంతకింపునన్

కం. అనియెంచి వాయునందను
డనలమువలెనుండి యెగసి యనిలునిభంగిన్
తనయూరు వేగముననా
వనమందలివృక్షపంక్తి వసుధంద్రోచెన్

కం. కోపించి మారుతాత్మజు
డీపగిదిన్వృక్షచయము నేర్పడవిఱువం
గా పక్షులుకడభయమున
నాపోవుచుసింగి కెగసి వగలంబొగులన్

కం॥ వృక్షములు విఱుగుశబ్దము
పక్షులధ్వనులెగయ మదినిభయమొదవంగా
వీక్షించిరి వనపాలకు
లాక్షణమునపరవర్యు నగచరునచటన్

గీ. ఆధ్వనిగ్ రాక్షసాంగనలాలకించి
నిద్రమేల్కాంచి తరుణార్కనిభు కపీంద్రు
గాంచినగ్ వారిజూచియక్కపివరుండు
పర్వతాకారమునఁదాల్చి భయముగొలుప

చం॥ జనకజచెంతకుంజని వెనన్
దనుజాంగనలామెతోడ యి
ట్లనిరి యితండెవండు నెవరంపగనిన్కటకేగుదెంచెనే
మనినినుహెచ్చరించె
భయమందకజెప్పుము యివ్వనంబుఁద
ర్జనవిఱువంగనేల
రభసంబునపర్వతసన్నిభుండునై

గీ. అనిన సర్వాంగసుందరియైనసీత
వారికిట్లనె నీతడెవ్వాడొఁదలప
వశమె బహురూపములగాని వక్రగతుల
సంచరింతురురాక్షససమితి యిలను

కం. అహిపాదంబులెఱుంగగ
నహికేశక్యంబునట్టు లసురులమాయల్
మహిఁగాఱుగువారలసురులు
సహనముగోల్పోతి మీదుసాన్నిధ్యమునన్

కం॥ ఇచ్ఛకువచ్చినరూపము
నుచ్చికధరియింపగలుగు మనఁజాశనుడే
వచ్చెను వానరరూపంబచ్చుపడన్
మేన సందియములేదరయన్

కం॥ ఇతడెవ్వడు యీవనమీగతిధ్వంసముసేయనేల
కపిరూపమునన్
ధృతిబూనిచెప్పుడనినన్
గొటుకుచు నవ్వనితలంత ఘోరాకృతులై

కం॥ రావణునకావిధంబును
వేవేగంజెప్ప జనిరి విశదంబుగ సీ
తావనజాక్షినిగావగ
నావెలదులకొందఱుండిరట నామీఁదన్

గీ॥ రాక్షసాంగనలంతట రాక్షసేంద్రు
నసముఖమునకేగి మ్రొక్కుచు సవినయమున
దేవ వానరుండొక్కఁడు దీప్తిమెఱయ
నంబుధినిదాటి మనలంకకరుగుదెంచి

చం. ప్రియమునముచ్చటించె
పలురీతులజానకితోడ నంతని
ర్భయమునపర్వతాకృతిని
బాహుబలంబుననుబ్బుచున్ దుర
త్యయము మనోజ్ఞమైబరగునట్టి
భవద్వనమెల్ల నేడు ని
ర్దయతరుశూన్యమౌగతి మదంబున
పాడొనరించె నేమనన్

శా. సామర్థ్యంబున బాహువిక్రమునన్
చండాంశునింబోలు _ సు
త్రాముండంపగవచ్చెనో
ధనదుడే దైతేయులంజంపగా
నీమాడ్కిన్ బురికొల్పవచ్చెనొకో
దైత్యేంద్రా విచారించుచో
రాముండంపినదూతయో
దెలియగారాదేరికిన్ సుంతయున్

గీ. నందనోద్యానవనమును గ్రింగువ లను
పావనంబగు నీయశోకావనంబు
జూపరుల విస్మయ మునొంద నేపుమీరి
నాశమొనరించెదేవ యాకీశవరుడు

కం॥ జనకజకునీడనొసగెడి
ఘనపాదపమొకటిదక్క కపిపీగండా
వనమందలివృక్షమ్ముల
సునిశితమతివెదకి వెదకి చూర్ణముజేసెన్

కం॥ నీమదికోరినకోమలి
నీమహిమనుధిక్కరించి నెవడేనియు దా
నీమహిసంభాషించునె
ధీమహిమోన్నతవిరాజ దీపితతేజా

ఆ.వె. వానివిక్రమంబు వానిజనంబును
వానితేజమెంచ దానవులను
నొక్కమొగినిగ్రమింగ నుక్కలుండగు నింద్రు
నాజ్ఞవచ్చినట్టి విజ్ఞుడేమొ

మ. నినసాధింపయు ముందు
భూతమొకదానికిపేర్మిసృష్టించి బం
పెనొకోయివ్విధి -
నీవుకోరినసతిన్ బెండ్లాడనూహించుచో
దనుజాధీశ దురాత్ముడొకపివరున్దండించి నీభృత్యకో
టినిరక్షించుటలెస్స నావిని
నిశాటేశల్లభుండంతటన్

కం॥ జ్వలనముపైఁబడి త్రిధి
శలభంబులరీతి రాక్షసవ్రజమంతన్
బలయుతుని మారుతాత్మజు
కలనఁదుర్పంగ వెడలగా నుగ్రండై

చం॥ పరిసములన్ కృపాణముల
పట్టిసతోమరబాణహస్తులన్
సురరిపులన్ భయంకరులజూచి
ఘహోధ్వనినింప భూనభోం
తరములచార్చుచున్ కపివతంసుడు
బాహులనప్పళించుచున్
ధరణికిడిగ్గి దానవులధైర్యముపాయవచించెనిటులన్

గీ॥ జయమొదవుగాతరామలక్ష్మణులకిలను
కెరలుసూర్యజుడైన సుగ్రీవునకును
విజయమగుగాత రాక్షసవీరులార
యనిలునిసుతుండ హనుమంతుడంద్రుడు నన్ను

కం॥ హితుడను సుగ్రీవునకున్
మతిమంతుడుఁ జనుపప మైథిలివెదకన్
ధృతిరామదూతగానిట
కతిరయమునవచ్చి రావణునతినుగంటిన్

కం॥ అనినింగికెగసియుబిచుచు
హనుమంతుడు మరలనిట్టులనియె నిశాటుల్
మనమునభీతిన్ నడకగ
వినుడోరిదైత్యులార విలయార్చగతన్

ఆ.వె దనుజకోటికమును తత్తరకడజంపి
సీతకెఱిగి రాముచెంతకేను
మరలువాడ వేయుమందిరాక్షులలేని
సాటికారునాకు సత్యమనిన

కం. నానావిధాయుధమ్ములు గల
దానవఖలాళ్ళుచును హనుమతనువునవాటన్
వానరవర్యుడుకినుకన పూనిక
రాక్షసులజంపబూని రయము.న్

గీ. ద్వారముననున్న పరిఘహస్తము నడాల్చి
సర్పములజంపు గరుడునిచందమెనయ
దైత్యులనుజంపి మరలయుద్ధమునుగోరి
ధైర్యముననుండె నాబహిర్ద్వారమందు

కం. హాశేషులైన రాక్షసులతిరయమునబారి
రావణాంతికమునకున్
ధృతిసెడపలికిరివ్విధి
హతులైరినిశాటులెల్ల నవ్వానరుచేన్

గీ. ప్రళయకాలరుద్రునిభంగి పారిసనురి
భయముగొలుపుచు నీప్రియభటులదునిమి
దర్పమెనయంగ పురబహిర్ద్వారమందు
గంతులిడుచుండె దేవ యక్కపివరుండు

కం. హనుమంతునిచే
రక్కసులనిమొనమురణించిరనుచు నసుర ధిపుడున్
వినిమనమునశోకించుచు ను
ననుపమబలుడైన యాప్రహస్తుసుతనయున్

గీ. జంబుమాలిని విక్రమోజ్జ్వలన తేజు
నంతకాకారు నమితదివ్యాస్త్రశస్త్ర
గర్వసంయుత శౌర్యవిగ్రహాకలితుని
యుద్ధమునుగోరువాని ధీయుతు నక్షితుని

చం. కనుగొనికూర్మినిట్టులనె
గర్వమునన్ జలరాశిదాటివ
చ్చెనొకప్లవంగమిచ్చటికి
సీతకుధైర్యముజెప్పి మీదనా
వనమునుబాడుచేసి బలవంతులు
ధీరులు నీతివిత్తముల్
దనుజులబట్టిజంపెనట
దానికినెంతటిశౌర్యమబ్బెనో

గీ. నిన్నెఱుంగుద నె[illegible]గుదునీబలంబు
నింద్రుడేనియు నిన్నుజయింపగలడె
రణమునన్ బ్రీతి నవ్వానరమునుజంపి
రమ్ము పొమ్మన మ్రొక్కి యారక్కసుండు

కం. దనుజాధీశునిపంపున
తనశౌర్యముమెచ్చుకొనుచు దంభమునన్ బా
వని యుండుజెసకు
జనియెను దనుజులుజేల వెట్టు తామసవృత్తిన్

గీ. దనుజులన్ జంపి దనమదిందలచెనిట్లు
కపివరుండంత నీయశోకావనంబు
విఱిచిజాఱితి నిటునాడువిక్రమమును
శ్రీకరమ్మును రాక్షససేవితమగు

కం, చైత్యప్రాసాదమ్మును
దైత్యులకున్భీతిపుట్ట ధరణింబడ నా
దిత్యులువొగడగగూల్చెద
ప్రత్యర్థులుచిన్నబింప రావణుతోడన్

కం. అని చైత్యప్రాసాదంబునకెగసి
మహారవంబుబొడమగ నసురుల్
మనమునగుందగనొప్పెను
నవిలసుతుండెంచ పారియాత్రగిరివలెన్

మ॥ హనుమంతుండనిలోపమానజవమాహ్లాదంబుదీపింప త
ర్జనలంజేయుచు గర్జనల్సలుపుచున్
ప్రాసాదమీరీతినె
క్కిన నద్దానినిగాచురక్కసులు
శక్తిప్రాసఖడ్గమ్ములన్
గొనిరక్తిన్బ్రహరింప
వాయుజుడునక్రోధాగ్నియుక్తుండునై

కం. ప్రాసాద స్తంభమ్మును
భాసురమణిబెత్తికి ద్రిప్పి బర్హిశ్శిష్ఠం
భాసమయంబున వెలువడి
ప్రాసాదంబెల్లదాన భస్మంబయ్యెన్

కం. అనిలజుడా స్తంభముచే
దనుజులనూర్గురవధించి దర్పాన్వితుడై
వినవెల్లరట్లు పల్కెను
ననిలజుడన్ రాముబంటునగుదు నెఱుగుడీ

చం. జయమగుగాక రామునకు
సద్గుణధుర్యుడు లక్ష్మణుండు దు
ర్జయుడు నశేషవిక్రముడు
సంతతమున్ జయమొందుగాత - ని
ర్భయమున రాక్షసౌఘములబట్టి
వధించి దశాననుండెదన్
భయమునకృంగ
రాఘవునిపత్నికిమ్రొక్కి యథేచ్ఛనేగెదన్

గీ. వేయిమందిరావణులైన విక్రమమున
సాటిరారు ధరిత్రినిజంబునాకు
తథ్యమనియార్చి సింహనాదమొనర్చె
రాక్షసులశక్తి శౌర్యధైర్యములు దఱుగ

సీ. రక్తమాల్యాంబర ప్రణిహితగాత్రుండు
సురుచిరకుండలశోభితుండు
కఠినదంష్ట్రుడు మహాకాయుండు
నతిశౌర్యయుతుడు దుర్జయుడు మహోదరుండు
నౌ ప్రహస్తాత్మజుఁడగు జంబుమాలి
రావణునాజ్ఞ బంధింపవాయుసుతుని
పురుహూతువి. టినిఁ
బురుడించుధనువును గైకొని ఖరములగట్టినట్టి

గీ. రథముపై ప్రాగ్దిశన్ వెల్గురవి విధమున
ననిలతనయునమీపించి యసురవయము
వినుతిసేయగ నిలుసిఁ వీరవర్య
యనుచు ద్వారముపైదూలమందుతిరుగు

గీ॥ అర్ధచంద్రాకంబున హనుమశిరము
నరయపదిబాణముల ముఖమందుచెవుల
బాహువుల గుచ్చ నప్పుడాపవనసుతుని
ముఖమురక్తమయంబునై మొగ్గతిలగ

ఉ. బాణహతిన్శరీరమున
పద్మమునుండిస్రవించు తేనె నా
శోణితమెంతయుంబొరయ
శోభమరుత్సుతుడంత చెంతపా
షాణముజెచ్చెరంబెరికి
వచ్చితివంచనిజంబుమాలిపై
రాణువభీతినొత్తిగిల
రానభములవడ పెద్దయార్చినన్

## హనుమంతుడు జంబుమాలినిచంపుట

మ॥ పదిబాణంబుల మూర్ఛ మైధరబడన్
పాషాణముం ద్రుంచి యి
ర్వదిబాణంబులగొట్టరక్కసుడు
నవ్వాతాత్మజుం డేచి దు
ర్మదునిన్ ధీరుని జంబుమాలిని
వెసన్మర్దింపగా నెంచి యి
ప్పిదమై చెంగటనున్న సాలతరువున్
బేర్మిన్ బెకల్చెన్ వడిన్

కం॥ దనుజుండా వృక్షంబును
హనుమంతుడు విసరబోవునా సమయమునన్
గనుగొన భగ్నము జేసిన
ననిలజుడొకయినుపగుదియ యటుగన్పట్టన్

కం॥ దానింగొని హనుమంతుడు
దానవునింగొట్ట రథము ధనువు ఖరంబుల్
గానన్ చూర్ణములై
ధరపైనెత్తురునొలుకఁ జచ్చె పరగనసురుడుణా

కం. హతశేషులైన దానవులతిభయమున నేగి
రాక్షసాధిపుతో నీ
గతిబలికిరో మహాత్మా ధృతిసెదరగ
జంబుమాలిచెగె నాకపిచేన్

చం॥ అనవిని రావణుండు
కనులగ్నికణంబులురాల మంత్రినం
దనులనుజూచియిట్లనె మదంబున
వానరుడొక్కరుండు నే
పునమన సేనలందు నిమి
పొంగుచుధీరుని జంబుమాలినిన్
పెనకువజంపివైచెనట
పీచమడంపుడు వానినిత్తటిన్

చం. అనిన మహాప్రసాదమని
యానచివాత్మజులేడ్వురున్ దశా
ననుడుప్రియంబునొందగ
ఘనంబగుదీప్తిమహాస్త్రశస్త్రముల్
గొనిం గొలువన్ నిశాచరులు
గొప్పరథంబులనెక్కి యగ్నిహో
త్రునివలెమండుచుం జని
మరుత్సుతుదాకిరి భీమరూపులై

## మంత్రిసుతసప్తకము హనుమంతునిచేజచ్చుట

గీ. స్యందనధ్వని గర్జితస్వనముగాగ
మంత్రిసుతశ ప్తకమునెంచ మబ్బులట్లు
బాణవర్షముగురిపించి పవనసుతుని
తనువు రక్తధారలనొప్ప తటిమింగొట్ట

గీ. రాక్షసులఘోరబాణవర్షనమునిగి
వానచేగప్పబడుహిమవంతురీతి
నొప్ప ధీవరుడైనవాయుజుడునలిగి
చెంతగల యొక్కపరిఘముచేతదాల్చి

కం॥ కొండలచేతంజిమ్ముచు
కొండలవక్షంబులతోడగ్రుద్ది దునుముచున్
కొండలనఖములజీల్చుచు
నందరబరిమార్చె దివ్యులభినందింపన్

గీ. మంత్రిసుతసప్తకంబునిమ్మాడ్కిజంపి
యగ్నివలెరేగి కదనుసైన్యమున్ముదుంచి
తోరణప్రదేశమునందు దుర్జయుడగు
ననిలజుండుండ హతశేషులైనవారు

ఉ. రావణుచెంతకుంజని
ధరంబడిసాగిలిమ్రొక్కుచున్ భయం
బావహిలన్ రణాంగణమునందున
నేడ్వురమంత్రిపుత్రులన్
శేషవధించెవానరుడుడీకొని
యంచువచింప నివ్వెరన్
భావముదక్కియిట్లను
సభాస్థలిరావణుడెల్లరున్ వినన్

ఉ. వానరుఁడొక్కఁడిట్లు
బలవంతుల ధీరులజంపుటేమి - దు
ర్మానసులైనదేవతలు
మంత్రహుతాగ్ని జనింపజేసి యీ
వానరభూతమున్
దనుజవర్గమునిబ్బిభజింపబంపిరే
మో నిరపాయమౌవిధిని
ముట్టడిసేయుట మేలుయిత్తఱిన్

గీ. ప్రఘసునిన్ భాసకర్ణు దుర్ధరుని
విక్రమాఢ్యులగువిరూపాక్ష యూపాక్షులనెడువారి
పంచసేనాధిపతుల నేర్పడకనుగొని
చెన్నుమీరగ కపినిశిక్షించిగఁడు

కం॥ సేనానాయకులారా
వానరుబంధించి మీజవంబు బలంబున్
దానవులఁగన్గొనియాడగ
మానితమగుదీప్తిమీరు మహివెలయుడికన్

గీ॥ వాలిసుగ్రీవులను జాంబవంతు నీలు
ద్వివిదులను వానరులజూచితిని నిజంబు
వారికీవిక్రమంబు జవంబు ఠీవి
తేజితోత్సాహములు గణుతింపలేవు

చం. అరయగవానరాకృతి
జయంబుగొనంజనుదెంచినట్టి య
బ్బురమగుభూతమేయనుచు
బుద్ధివలంచెద నప్రమత్తులై
త్వరజని ధూర్తుడైమెలగువానరు నేర్పునబట్టితెండు ని
ర్జరులజయింపగాదగు
పరాక్రమవర్యులుమీరలెంచగన్

గీ॥ యక్ష గంధర్వ దేవాసురాహిచయము
మనుజయించితి మీసాయము పరణమున
లెక్కయేమీకుయిక్కపి లేశమేని
పొందునాయాజ్ఞ శోభనంబులువరింప

గీ॥ రాజనీతిజ్ఞుడగువాడు రణమునందు
నిశ్చయింపగలేడు మన్నిక విజయము
కానమీరలు మిమ్ముగాచుకొనుచు
జాగరితవృత్తినమవుడు చతురులగుచు

## హనుమంతుడు సేనానాయకులేవురంజంపుట

మ॥ అనినక్ రావణునాజ్ఞనాయసురులత్యంత
ప్రమోదమ్మునన్
ఘనమౌకార్ముకముల్
మహాస్త్రములు శంఖంబుల్ వెసందాల్చి గ
ర్జనలంజేయుచు సైనికుల్ గొలువఁ
దూర్యధ్వానముల్ మ్రోగ రం
జనహాతాత్మజుడున్న చెక్కునకు
నెంచక జేరియుద్వృత్తులై

కం. సేనానాయకులేవురు
భానునిభున్ బుద్ధిమంతు బలవంతుని న
మ్మానితయశు గుణవంతుని
జ్ఞానిన్ హనుమంతునరసి సాహసయుతులై

వం. అరదములన్ గజంబుల
హయంబులనెక్కి ధనుఃకృపాణము
ద్గరపరిఘాదిశస్త్రముల
గైకొని వెంటఁబదాతిసైన్యముల్
శరనిధులట్లుసాగ
రభసంబునపావనిజుట్టుముట్ట - దు
ర్ధరుడు కపీంద్రుడుగొట్టె
సముదంబునదైత్యులు మెచ్చిచూడగా

వం. శిరములునైదుబాణముల
చేడ్పడగొట్టిన సింహనాదముల్
బోరయవడిన్ నభంబునకుపొందికనేగ
రధంబుతోడదు
ర్ధరుడు వధంబుకున్నెగసి
దర్పమతింబవమానపు టునిన్
శరములనొంపవాయుజుడు
సత్వరమాతనిజంపనుక్కనన్

ఉ. శైలనిభోన్నతంబునగుచాడ్పున
బిట్టుగమేనుబెంచి - వా
తూలమురీతిపైకెగసి దూకిన దుర్ధరువేరిమీదికిన్
దాలిమిదక్కి వాడును రధంబుసుభగ్నముగాగ నేలపై
గూలిసురారులున్నగవఁ
గూయిడిజచ్చె సురేంద్రుడుబ్బగా

గీ. నోటనెత్తురువడగ దన్నుకొని జావ
దుర్ధరునిదుర్దశనుజూచి ధూర్తచరితు
డైన యూపాక్షుడటు విరూపాక్షుగూడి
పవనతనయునిదునుమ సభమున కెగసి

కం. పరిఘంబులనొప్పించిన
నయణాక్షుండగుచు క్రోధితాత్ముండై దు
శ్చరితులజంపగ కపివరు
డ రవుగనొక సాలతరువు నొగి వెఱికివడిన్

కం. యూపాక్షుంబరిమార్చి
విరూపాక్షునినమయజేసి రుద్రునిగతి యా
టోపంబునదైత్యులు మది
వాపోవగ గజతురంగ వాహినిద్రుంపన్

గీ. ప్రఘసుడున్ భాసకర్ణుడున్
పరిఘములనుదాల్చి నభమునకెగసి క్రోధంబునిగుడ
ననిలతనయునినొప్పింప నతడుకినిసి
యార్చుచున్ గిరిపెకలించి యలజడివడి

చం॥ దనుజులశీర్షముల్ వగుల
ధారుణిగూల్చి నిశాటసేనలన్
దునుముచు సింహనాదముల
దూకులుపెట్టుచు సంచరింప భీ
తినిహతశేషులంతటు
మదిన్ వగనొందుచు పాఱిరావణుం
గనివచియించిరిట్లు
పరగన్ కపిరేగివధించె సేనలన్

సీ. ప్రఘసుండుమరణించె
భాసకర్ణుడుజచ్చె మడిసెయూపాక్షుడు మదిగలంగ
దెగెవిరూపాక్షుండు దేవదుర్ధరుడిగ్గె
ము॥ సైన్యమా ధృతిమంతుడైన
వానరాధిపుశక్తివర్ణింపబూదియై
గజతురంగంబులు కలనగూలె
ననిజెప్ప మండిదశాననుడంతట
కయ్యమెల్లప్పుడు కాంక్షసేయు

గీ. మహితవిక్రమునక్షకు మూఱువంక
జూచినని హోమమునవేల్వ శోభదనరు
నగ్నిహోత్రునివలె కాంచనాన్వితంబు
నైనదొడ్డవిల్లునుదాల్చి, యబ్బురమున

గీ॥ తండ్రికినమస్కరించి
యాదనుజవిభునిపంపునన్ స్యందనంబెక్కి భక్తిగొలుచు
రాక్షసులువెంటనడువ ద్వరన్కపీంద్రు
డుండువెననేగె నానందమురవడింప -

ఉ. వారినిధుల్గలంగె
గిరివర్గముసంచలనంబునొందె న
వ్వారిజమిత్రుతేజమునువాసియడంగె
చలించెధాత్రియున్
దారలురాలెఁ జీకటియుదగ్రత
దిక్కులగ్రమ్మె భూతముల్
బోరననార్చె శేషుడును:బొమ్మరవోయె
భయంబెసంగగా

ఆ.వె. దుర్నిమిత్తములును
దుశ్శకునంబులు దుర్నిరీక్ష్యమగుచుదోప నెదుర
లేశమేనివానిలెక్కింపకన్
యక్షుడనిలసుతునిమీద కరిగె వేడ్క

కం. హనుమంతుండు
నశోకావనబాహ్యద్వారమందు వాసినిలువగా
గనుగొనిమూడుశరంబుల
ననువుననక్షుండుగొట్టె నతిమోదమునన్

కం. చతురుండగునాయక్షుడు ధృతియెసగన్
వానరేంద్రుతేజంబడుగన్
స్తుతికడుశరజాలమ్ముల
నతులితముగముంప నలచె, ననిలజుడంతన్

గీ. మరలమూడుబాణంబులు శిరమునందు
నదిప్రయోగింప నెత్తురుపుడమిదొరగ
బాలసూర్యునివలె శరజాలములును
కిరణములభంగివెలిగె వానరవరుండు -

కం. అక్షయునివీరవర్యుని వీక్షించి
మరుత్సుతుండు పేడసురులలో
దక్షుడనిదలచి నింగికిలక్షణమెగయంగజూచి
దర్పోజ్జ్వలుడై

గీ. రథముతోఁ గ్రుంగి కెగసి పరాక్రమమున
యక్షుఁడావాయుజుఁదాకి యస్వరమగు
గర్జనల వానరుని శిరఃకంఠములను
గొట్టె తీవ్రాస్త్రములదివ్యకోటిబెగడ

కం. దనుజతనూజుని శరములు
తనపైబడకుండఁప్లవగతల్లజుఁడున్ నిం
గినిఁ దిరుగుచుండ నక్షుఁడు
మనమునగర్వంబునొంది మారుతినొంపన్

గీ. ప్రళయకాలాగ్ని హోత్రునిభంగి వెలుఁగు
పావనిం జూచి యక్షుఁ నుపటిమనొప్పు
ధీమహితుఁడు పరాక్రమతేజుఁడనుచు
సాదరంబునవీక్షించి సత్వరమున

కం॥ ధనువింద్రధనువురీతిన్
గనుపింపగ యక్షుఁడరయగా మేఘముభం
గినిఁజూపట్టుచు శరముల
ననువుగవర్షమునుగురిసె హనుమంతునిపైన్

చం. దనుజకుమారుఁడిట్టిఁభి
మదంబుననొప్పగజేయ వాయునం
దనుఁడుమనోజవంబున

సదాగతివోల్భ్రమించుచున్ మనం
బునదలచెన్ బలుండునుకుబుద్ధియు
రావణనందనుండు నీ
దనుజునివీఁడుబాలుఁడని
ధర్మముగాదుయుపేక్షసేయగా

ఆ. వె. వృద్ధినొందుచున్న వీతిహోత్రునివిధి
ప్రజ్జ్వరిల్లు వీనిబట్టిదునుమ
వలయునంచునెంచి
వాయుపుత్రుడుచేతజలచె మీదకెగసిశౌర్యవృత్తి

కం. మారుతిగొట్టినదెబ్బకు
సారథియును వారువములు స్యందనమున్ వే
ధారుణిబడిచూర్ణంబై
సారవిహీనంబునైన సంభ్రమమొదవన్

చం. అతిబలుడున్ మహారథుడునైపనమీరెడియస్త్రుడంత స
మ్మతివెసదాటి కోపమున
మారుతినింబరిమార్ప ఖడ్గమున్
ధృతిగొని పైకిదాకగయ
ధీమహితుండుకపీంద్రుడుకున్ననన్
చతురిమ వానిపాదములుజానుగబట్టి
నరోషమూర్తియై

ఆ. వె. వేయిమార్లుద్రిప్పి వేగంబునన్నేలగూలవైవ
నసురకోటిబెదర
కరము లూరువులును కంఠము మొలయును
విఱుగ నెత్తురొలుకవివశుడగుచు

కం. మరణించిన హతశేషులు
పరుగునరావణునికడకుపాటి బలికిరో
సురమర్దన యక్షయునిన్
పరిమార్చెను వానరుండు భయమొదవంగా

కం హనుమంతునిచే
సక్షయుడనుపమబలశాలిదె్చుట యాలించిభయం
బును దుఃఖంబును వగవున్
దనమనమునవడచుకొనుచు దత్తరవడుచున్

కం॥ తనతనయుమేఘనాదుని
ననినింద్రునిగెలుచునట్టి యత్యుత్తమవీ
రునిజూచి యిట్టులనియెన్
మనపరశస్త్రాస్త్రవిదుని గర్వోద్ధతునిన్

మ. నినుచా వానరుబట్టిదెచ్చుటకునై
నేఎంప రాజాలనై
నను నీతమ్మునినక్షయుందునిమి
విన్నాణంబునన్ సింహాగ
ర్జనలంజేయుచునుండె నిప్పురమునన్
రాకొట్టిబంధించి దెం
పునఁజెంతకుఁదోడిదెమ్ము
దనుజుల్ భూషింప నోపుత్రకా

మ. సురగంధర్వసరాహిరాక్షసులలో
శోభన్ రణంబందు నీ
సరిలేరెవ్వరు నీతపంబు
బలమున్ సామర్థ్యమూహింప దు
ష్కరమౌనేరికినైన దుర్జయుడు
విక్రాంతిప్రబదర్శించు ధీ
వరునవ్వానరుబట్టిదెమ్ము
యశమున్వర్ధిల్ల నిప్పట్టునన్

చం. దనుజులబట్టిజంపె
బలదర్పయుతుండగు జంబుమాలినిన్
కినుకవధించె ధీవరులకింకరులంబరిమార్చె మీద నీ
యనుజుడుసక్షయుండునిమి
యశ్వములన్ రథముల్ గజంబులే
ప్రునమనియంగజేసెను
కుబుద్ధిని- వానివిధంబదెట్టిదో

గీ. రాజధర్మముకలచి శౌర్యయుతుడైన
నిన్నుబంపించుచుంటి నీనేర్పుజూపి
యతనిబంధించివడిదెమ్ము
యస్త్రములకు వెరువడాతడు పాయముచెదశవలయు

కం. లొంగడుశస్త్రాస్త్రములకు
సంగరమనభీతిలేక శౌర్యోజ్జ్వలుడై
బొంగుచు రిపులంజంపును
భంగింపుము వాని చతురుపాయగుణములన్

కం. కులిశమునబట్టుబడడత
డలయుడులెక్కింప డెందరాతనితోడం
దలపడియుద్ధమొనర్చిన
కలవిధమిది నీకుజెప్ప గావలెనొక్కో

కం॥ జనకుండీవిధిజెప్పిన
వినియసురోత్తముడు నీతివిదుడున్ మాయా
ధనియైనమేఘనాదుడు
జనకునకున్ మ్రొక్కి దనుజసమితిగొలువగా

## మేఘనాథుడు హనుమంతుని బంధింపనేగుట

చం. ఉరవడినింద్రతుల్యుడు
మహోన్నతతేజుడు విక్రముండు నా
టరగు రణప్రవీణుడును
భంజనశాత్రవుడై జెంతగు ధీ
వరుడగు మేఘనాదుడు
జవంబునకాంచననిర్మితంబునై
వరలురథంబునన్
దనుజవర్గముసమ్మతివెంటనంటిరాన్

గీ. అస్త్రవేత్తయు ధన్వియు
శస్త్రవిద్యనారితేరిన వాడును వీరులందు
నగ్రగణ్యుడు శాత్రవనిగ్రహుడగు
రాక్షసాధిపసుతుడు విపక్షునొంప

మ. కడునుత్సాహమునన్
ధనుశ్శరములన్గర్వంబుననదాల్చి ధీ
రుడునౌ వాయుజునొంపనేగిన
మహాత్ముల్సిద్ధసాధ్యామరుల్
కడకన్వారిరణంబుజూడ
మదిలోకాంక్షించి రావచ్చిర
య్యెడనమ్మారుతి
శాత్రవుంగెలువదానింపారకుప్పించుచున్

మ. ధరణీచక్రముదిర్ధిరందిరుగ
పాథోజాళంబుఘూర్ణిల్ల ది
క్కరులున్ మ్రొగ్గ ననంతుడార్వ
గిరివర్గంబుల్ జలింపన్ దివా
కరశుభ్రాంశులకాంతిమాయ
జలధుల్కంపింప లోకేశుడ
చ్చెరువొందన్ బవమాననందనుడు
జేసెన్సింహనాదంబొగిన్

కం॥ ఆసింహనాదమును విని
గాసిలిదైత్యవ్రజంబుకటకటబడగా
వాసిదశాస్యునితనయుడు
భాసురమతి ధనువుబూని పావనినొంపన్

ఉ. ఆయతతీక్ష్ణశల్యముల
నర్మిలికాంచనచిత్రపుంఖముల్
వేయ సమీరనందనుడు
విస్మయమందుచు నభ్రగామియై
ధీయుతుడై వడిందిరుగ
దేవరిపుండు పరాక్రమంబునన్
వాయుతనూభవుంబొదువవైచె
నమోఘమయసన్నిభాస్త్రముల్

ఉ. ఇరవురువిక్రమాఢ్యులు
సహోపరాక్రమవర్యులౌట నొం
డొరులజయించకోర్కె
గరుడోపమ దుల్యజవంబునన్ సురా
సురులు భయంబునొంద
పరిశోధనయుద్ధమొనర్ప దానవే
శ్వరతనయుండు ఖిన్నమతి
వానరవర్యునివంక జూచుచున్

ఇతనివధింపనాకలవియే
యమరాసురబృందమొక్కటై
ధృతిననుడెంచిరేని
గణుతింపపరాజయమొందిదీనులై
మతవగగుందరే భువనమాన్య
సమర్థునినిక్కపీంద్రను నే
గతినికనిగ్రహింపనగు
కట్టడిబట్టుట నెట్టులో గదా

అస్త్రవేత్తలనుత్తముడైరహించు
రావణిదలంచియిట్లు ధీరమతియగుచు
పరగబ్రహ్మాస్త్రమరిబోసి పవనసుతునిఁ
గొట్టెపిపిజులుబెదరి దిక్కులనుబార

హనుమంతుడుబ్రహ్మాస్త్రంబునుదాకిన
చేష్టలుడిగిపడమినిర్వాలం
గనుగొనిదైత్యులుబొగడిరి
దనుజాధిపసుతుని సమ్ముదమునణా తేవన్

వం. అనిలతనూభవుండు
బ్రహ్మాస్త్రముగన్నటగట్టివైవ ది
వ్యనుతుడు వారిజోద్భవుమహాత్మ్యమునెంచుచు
బ్రహ్మమంత్రముల్
వినుతిఁబఠించుచున్దలచె
విశ్వనియామకుడాదిదేవుఁడి
చ్చినవరమున్ప్రభావమును
దేవమునంబు నిర్వికారుఁడై

గీ. విధివరంబునశస్త్రాస్త్రవితతినెంచ
దలపబాధింపవెన్నఁగు ధర్మబుద్ధి
నన్నుబ్రహ్మేంద్రపవనులెన్నగనిరతముఁ
గావ, భయమేల నమ్మోదకారణంబె

గీ. కట్టుబడవలెనేను నిక్కమలగర్భు
నస్త్రమునకీరితోరావణాంతికమున
కేగుటయు వానితోడభాషించుటయును
నొదవుగాపున బద్ధుఁడైయుందునేను

కం. హనుమంతుఁడుద్రుహిణాస్త్రంబున
బద్ధుండగుటజూచి బొంగుచుదనుజుల్
ఘనబలునినారచీరల
గొనకొనిబంధించియతనిగొట్టుచునుండన్

గీ. దనుజులీరీతిఁగ్రొవ్వునత్రాళ్ళగట్ట
బ్రహ్మబంధమునడలిన రావణాగ్ర
నందనుఁడునిట్లుదలచె మనంబునందు
నౌర నాశ్రమమంతయువ్యర్థమయ్యె

కం॥ దనుజులమూర్ఖత్వంబున
ఘనమగుబ్రహ్మాస్త్రమిట్లు కనుగొనవమ్మో
జనుట యితడెటిగెనేనియు
నను దనుజులలెక్కసేయునా చింతింపన్

గీ. ఐననీతడెఱుంగడీయస్త్రమిట్లు
ప్రతిహతంబౌటననుచు నెప్పటివిధమున
నసురులకుసైగజేయ వారతనియాజ్ఞ
ననిలసుతునిమర్ధించుచు నతిరయమున

కం॥ రావణునాస్థానమునకు
పావనిగొనిపోవ నతడుపరికించెనటన్
దేవేంద్ర తీవినొప్పెడు
రావణుసురశాత్రవున్ పరాక్రమవర్యున్

## హనుమంతుడు రావణునివైభవమున కాశ్చర్యమొందుట

సీ. స్వర్ణమౌక్తిక విరాజప్రబర్హముసైన
మకుటమణిప్రభల్ మంజులముగ
రత్నస్థగితమును రక్తచందనయుత
బాహుపురుల్ కాంతిబర్వ దిసల
నీలాంజనాద్రివన్నియనొప్పుతనువున
పంచశిరంబులబరగునట్టి
ఫణివలెనలరారు బాహుదండంబులు
బహుదుష్టజంతు సంపన్నమునగు

గీ. మందరాద్రివిధంబున మహుఘమించు
తేజమునరక్తనేత్రుడై ధృతిజెలంగి
స్ఫటికమణిపీఠమున దివ్యభామినులను
బోలుయువతులు చామరంబులనువీవ

సీ. నాల్గువారిధులట్లు నలుపురుమంత్రులు
దుష్ప్రహుండును ప్రహస్తుడు నికుంభు
డనగ మహాపార్శ్వుడనన్నొప్పువారటు
సేవింపవై భవశ్రీలెసంగ
సింహాసనంబునచెలగురాజుజూచి
సామీరిమదినినాశ్చర్యమొంది
యీబలంబును తీవి యీ రాజసముకాంతి
శుభలక్షణంబులజూచితేని

గీ. యింద్రునిని దేవలోకమునేలజాలు
నట్టిశక్తియుధృతియు సౌభాగముగలిగి
మహినధర్మరతుండుదుర్మార్గుడెంచ
క్రూరకర్ముడు జనకంటకుండునగుట-

కం. త్రిదశాసురవరులెల్లరు
మదిభీతివహింతురితని మరిజూచినచో
మదయుతడగునితడలిగిన
నుదధింగావించు జగమునుత్సాహమునన్

కం॥ అనిమదినాశ్చర్యమ్మున
హనుమంతుడుదలచుచుండ నసురవిభుండా
ననిలాత్మజునినతేజుని
గనుగొనిజెంతించె భీకగలపవనమునన్

కం॥ మునునేకైలాసాచలమును
గదలింపంగకోపమున శాపంబి
చ్చిననందికేశ్వరుండే
నసుహింసింపంగవచ్చెనా యీరీతిన్

మ॥ బలిపుత్రుండగు బాణుడీవిధమునన్
బాధింపగావచ్చెనాం
దలపోయన్ గపిరూపమూని
యనుచున్ దర్కించి కోపంబునన్
గలయంజూచి ప్రహస్తుకిట్టులను
శంకాలేశమున్లేక మొ
క్కలుడీవానరుడెవ్వడిచ్చటకు రాగా
కారణంబేదియో

గీ. వచ్చెనెవడంప నావైనవనముపెఱిచి
దైత్యులనుజంపె వీనివిధంబెఱుంగు
మన ప్రహస్తుడు
రావణునాజ్ఞపవనతనయుతోనిట్టులనె సహృదయుఁడీవి

కం. కపివేషంబునుగైకొని
కుపథంబుననగరుజొచ్చి గొంకకసురా
ధిపుభటులజంపనేటికి
నిపుణంబుగజెప్పుమిపుడు నిక్కమువాతోన్

కం, వరుణుండో వానపుడో
సరసీజాక్షుండొ నిన్ను చారునిగా ని
ప్పురికంపెననిదలంతుము
సరళమతిందెలుపవలయు సత్యవిషయమున్

కం. నీవుయథార్థమువలికిన
చోవిడిచెదముల్లుగాక శూరుడవగుటన్
చేవంజూపదలంచిన
నీవేళనుజంపివైతురిచ్చటు జెపుమా

చం॥ అనవుడువాయునందనుడు
నాదశకంఠునిజూచియెల్లరున్
వినమధురోక్తులన్బలికె
విన్ముదశాసన విష్ణుదేవుశా
సనమునగాని
యూవరుణశాసనముంగొనిగాని యింద్రుశా
సనమునగాని
రానిటుకుసత్యపువానరుడే ..ఱంగుమా

కం. అనిలునితనయుడ సుగ్రీవుని
సఖుడన్ మరియురామునిబంటును న
ద్వినుతుడగురామునాజ్ఞను
జనకజనరయ గవచ్చి నమ్ముదమొదవన్

కం॥ నీలంకానగరంబుః
దాలిమిధరసాటియైనదానిని సీతన్
మాలిమినేకనుగొంటిని
నాలరివగునిన్ను జూడనద్భుతవృత్తిన్

## హనుమంతుఁడు రావణునితో సంభాషించుట

మ. వనమున్ భగ్నమొనర్చి
సేభటుల్ గిప్వ శ్రేణికీర్తింపగా
నని వెంటాడితి మీఁద కట్టుబడి బ్రహ్మాస్త్రంబుచే నిప్డు రం
జనని చొప్పటికి వచ్చితి స్వజము మాత్సర్యంబు పాటింపకన్
దనుజాధీశహితంబు జెప్పెద
నమంద ప్రీతనాలింపుమా

కం॥ సీతాసోదఁ తుల్యుండగు
నా సుగ్రీవుండు కడు ప్రియంబునొదవగా
నీ సేమమడిగె రావణ
భాసురమతి నే వచించు పలుకులు వినుమా

సీ. కాంతిమంతుడు సద్గుణాకారుడైన
దశరథసుతుండు సతిని సోదరుని గూడి
దండకారణ్యమందుండ తన్వియైన
ధరణిజను తస్కరించి యుద్ధతి నీవు

కం. కొనిచన్నుటా జటాయువు
వినిపించిన దాశరథులు విపినములందున్
జనకజను నిన్ను వెదకుచు
చనుదెంచిరి ఋశ్యమూకశైలంబునకున్

కం॥ అటు సుగ్రీవునితోడన్
బటుమతి స్నేహంబు జేసి పార్థివుడా పై
దిటవుగ వాలిని జంపెను
త్రుటినొక బాణంబు చేత దివ్యులు వొగడన్

కం॥ వనచరరాజ్యంబునకున్
దినకరతనయుండు సమ్మతిన్ ప్రభుఁడగుటన్
జనపతికిమోదమెసగన్
వనచరులను సీతనెమకఁ వడిబంపించెన్

కం. సీలంకసీతగలదని
మాలిమిసంపాతిఁజెప్ప మారుతినగు నే
గాలివలెసీదులంకన్
హ్రాలితికనుగొంటినిచట రామునిపత్నిన్

గీ. పండితుడవు తపంబునప్రతిభనొప్పు
ధీరుడవు నన్యకాంతలఁదివిరి యిళ్లు
తస్కరింనుటతగునె
పితామహుండుకమలభవుడటు నీకు యోగ్యంబెఁజెపుమ

కం. నీవంటిబుద్ధిమంతులు
భావింపగనన్యసతులబట్టుదురేసీ
తావనజాక్షిందెచ్చుటు
చావుంగొనిదెచ్చుకొనుట శౌర్యస్ఫూర్తా

కం. తపమునదీర్ఘాయుష్యము
నిపుణతసాధించితీవు నీబలమెల్లన్
నృపవరుడురాముడలిగిన
నపగతమగు దుష్టమతులకగునేశుభముల్

మ. దివికింబ్రాకిన వార్ధులందొదిగినన్
దేవేంద్రుసాయంబుగో
రిన పాతాళముజొచ్చినన్
జమునినర్థిన్ గావుమాయంచుమ
న్ననకాళ్ళంటిన నీతపంబునకునానాజట్లునంప్రీతిమె
చ్చిన నాళీకభవుండువచ్చినను
వాసింద్రుంచు రాముండనిన్

కం. రామునిబాహుబలంబును
సాహర్ధ్యమునెఱుగకిట్లు జంకించెదవా
భూమీశుడలిగెనేనియు
నీమదమున్ బలమడంగు నిజమసురేంద్రా

కం॥ సరసిజగర్భుడొసంగిన
వరములదేవాసురాహివర్గంబులచే
మరణములేదనియేగద
నరవానరసమితి నీదునామమడంచున్

సీ. తాటకంబరిమార్చెఁ దటిమెమారీచుని
శితికంఠువిల్లుద్రుంచెను గణింప
పరశురామునిభంగపరచె
విరాధునిపీఁలకుమార్చె కబంధుపీచమడచె
ఖరదూషణాదిరక్కసులవధించెను
వాలినిజంపె దేవతలుబొగడ
రాజనజెల్లునేరామభూపాలుని
నినుజంపమహిని జన్మించినట్టి

గీ. యాదిదేవునిగానెంచి యతనిసతిని
శీఘ్రమాతనికర్పింప చేరునీకు
మంగళంబులు లేనిచో మఘవుడేని
కావజాలడు చావునిక్కము దశాస్య!

గీ. నన్నుమించినవీరులు
నాకుసాటియైనవారలు వానరులమితబలులు
కలరుసుగ్రీవుచెంత లక్షలనుకోట్లు
నర్బుదములు పద్మంబులు నరసిచూడ

కం. గరుడానిలవేగంబున
ధర జలధిన్ వ్యోమమందు దర్పాన్వితులై
చరియింపగా సమర్థులు
వరవిక్రమవర్యులైన వానరులెంచన్

కం. నీసోదరాప్తవర్గము
నీసతులున్ నీపురంబు నీబలయశముల్
నీసుతులమేలుగోరిన
చోసీతనురాఘవునకు సొలయకనిమ్మా

కం. ఇనతయునిబలమెఱుగవె
నినువార్ధులముంచిదేల్చి నీపసయడగన్
నినుతికినెక్కినవాలికి
ననుజుడునింకేమిచెప్పనగు నసురేంద్రా!

గీ॥ కంఠిమునగట్టుకొంటివికాలపాశమిట్లు
ధరణిజనీపాలిమృత్యువగుట
నెఱుగవైతివి జానకినిచ్చి
రాముచరణములఁబ్రాలివేఁడుము శరణమీవు

కం॥ అనిచెప్పినక్రుద్ధుండై
కనులెఱ్ఱనగాగ నొడల కంపింపగ న
ద్దనుజేంద్రుడు హనుమంతుని
దునుమంగా భటులకాజ్ఞ దుర్మతినొసగన్

గీ. నీతివేత్తయు సద్గుణాన్వితుడు
ధీరుడగు విభీషణుడగ్రజునాననమును
గాంచియిట్లనె నీవుజక్కగనెఱుగుదు
రాజధర్మములన్ జతురత్వమొదన

కం. దూతనుపరిమార్చినచో
పాతకమగురాక్షసేంద్ర పండితుడగుదీ
రీతినధర్మపుకార్యము
ప్రీతినొనర్పంగదగునె పెంపునశింపన్

సీ. అక్షకుమారాది యసురులపెక్కండ్ర
జంపినవీనినేచందమునను
సైరింపగావచ్చు చంపుటేమేలని
బలుకుటుధర్మమే ప్రభుడునెట్లు
పలికిన నారీతిబలుకునాతనిబంటు
శక్తినారామలక్ష్మణులదునిమి
శత్రునిశ్శేషమెంచగనొనరించుట
యుక్తము దివ్వులనుక్కడించి

గీ॥ మహిమనలరారునీముందు
మనుజులెంత కానవీనికి తగినశిక్షనువిధించి
వెతలగొట్టిన నీశౌర్యవిక్రమములు(
గాంచి భీతినిగుములురాఘవుడు దేవ

మ॥ అమరన్ నీమదిలోదలంపుమిట
యుక్తాయుక్తముల్ పుణ్యపా
పములన్ దూతనుజంపకీర్తికరమా
ప్రాప్తించునాసంపదల్
గుమతిన్ ధర్మముహీడనాడకుము
యోగ్యుండైనప్రాజ్ఞుండవే
క్రమముందప్పిచరింపగాదగునె
వీరశ్రేణిభూషించునే

కం॥ శిరముండనమునొనర్చుట
పరికింపగనంగవికృతి పరిభవమున్(జె
చ్చెరసేయుట దండించుట
నరవిన్దూతలకునొప్పు శాస్త్రవిచారం!

కం॥ కోపంబునకున్వశ్యుడవై
పాపమతింజరింప నర్హంబగునే
కోపించి వీని జంపిన
చోపాలసుడనుచునిన్ను చులకనగనరే

కం వానరునిప్పురమునకున్
మానితమతిబంపినట్టి మనుజులకుంపం
గానీకుజెల్లునగ్రజ
నానిర్ణయమిట్టిదనిన నక్తంచరుడున్

చం. తనభటులంగనుంగొని
ముదంబునగద్దియనుండిలేచి యి
ట్లనియె విభీషణుండును
ప్రియంబునజెప్పినరీతి వానరుం
డునుముట మేలుగాదు
యహితుండుబలాఢ్యుడునైన వీనితో కనువెనగాల్చి
నెల్లరునుగానగద్రిప్పుడి లంకనెల్లెడన్

ఉ. తోకనుగాల్చిసమ్ముదముతో
పురవీధులద్రిప్పిద్రోలుడీ
యాకులపాటునొంది
బెగడందుచు రామునిజేరి రాక్షసా
నీకపరాక్రమంబు
గమనింపగసర్వము జెప్పి యేడ్చుచుగా
మోకరిలంగజేయుదన
మోదమునొందుచు దైత్యులంతటున్

కం, హనుమంతునివాలంబున
కనువుగవస్త్రములజుట్టి
యాపైతైలంబునముంచిమిగులదిట్టుచు
ననలముదరికొల్పి
మేలమాడుచురక్షిన్

కం. పురమందెల్లెడఁద్రిప్పుచు
నరుదెంచెనురామునాజ్ఞ నవనిజనరయన్
దురితాత్ముండగుపీడని
పరుషోక్తులబొబ్బలిడుచు బాధింపంగన్

చం. అనిలతనూభవుండు
దురితాత్ములు రాక్షసులప్పురంబునన్
గొనకొనిఁద్రిప్పుచున్
దివిరిగొట్టుచు గ్రుద్దుచునుండ మానసం
బునదలచెకా
నిశిధమునపూర్తిగలంత సుజాడనైతి రం
జనకనుగొందునిప్పుడు
నిశాచరవర్యులసౌధపంక్తులన్

చం. తలచినరావణాధముని
తక్కినదానవులన్వధించి నే
ర్పొలయనిమేషమాత్రమున
భూమిజనుంగొనిపోదు సద్గుణా
కలితుడురామచంద్రుసముఖంబునకున్
వివరింపతాముడీ
ఖలుడగు రావణుందునుముగాప్రతినంగొనెఁ
గ్రోవబాడియే

కం. అని చింతించుచునుండగ
దనుజాంగనలంతమీాద ధరణిజకడకున్
జని యిట్లనిరోసీతా
నినునాశ్వాసింపవచ్చి నీతోఁప్రీతిన్

గీ. మాటలాడి వనంబు దుర్మతిః విఱిచి
రాక్షసులజంపినట్టి దుర్మార్గుఁడైన
వానరునిబట్టి దండించి
వాలమునకునగ్నిదరికొల్పి పురవీధులందుత్రిప్పి

కం. అవమానించెదరదిగో
నవలాపరికింపుమనిన నవయుచుమదిలో
నవనిజసప్రాంజలియై
నవినయమున నగ్నిదేవుశ్లాఘించెమదిన్

శా. పాతివ్రత్యమునం దపంబున
నదాప్రాణేశునింగూర్చి సం
ప్రీతిన్జింతనసేయుదేని
విభుడాప్తిన్బ్రహ్మచర్యంబునన్
నీతిన్రంజిలునేని యిక్కపివరున్
నీ మంటలంగాల్పకన్
ప్రీతిన్ జందనశీతలుండవగుమో
భవ్యాత్మవైశ్వానరా

కం. అనిప్రార్థించిన
హనుమంతునివాలముకాల్పకగ్ని దురదురమంటల్
చెనగొనమండుచువెలిగిన
ననిలజుడబ్బురమునొంది యాత్మదలంచెన్

మ॥ కడు చోద్యంబుగదా
హుతాశనుడువిక్రాంతిన్‌బ్రదర్శించి చొ
ప్పడనా వాలమునంటివెళ్లినను
సంభావింపనూదేహ మే
ర్పడభస్మంబునుజేయబూనడిది
యాపద్మాక్షుడౌ రాముపై
కడిమింబ్రీతివహించిశీతలుడునై
గాపాడునే మో దయన్

గీ. జలధిలంఘించునప్పుడాజలధియందు
నచ్చెరువునొందగాన్పించె నద్రియొకటి
రాముమహిమయే దానికారణముగాన
నన్నురక్షింపబూనె ననలుడునేడు

చం. పరమపతివ్రతామణి
శుభవ్రత సీతకృపన్ మహాత్ముడౌ
సరసిజనేత్రు రామువుని
చారుగుణామృతవృష్టి నాపయిం
గురియుట ప్రీతిహోత్రుడును
కూరిమిచందనశీతలుండునై
కరుణదహింపకుండెనను
కావునతృప్తినిగూర్తు నగ్నికిన్

## హనుమంతుడు లంకనుఁగాల్చుట

మ. అనివేగంబున రక్తిపైకెగసి
సింహధ్వానముంజేసి రం
జనబంధంబులుపీడ
నుగ్రునివలెన్ శౌర్యంబెసంగన్ రయం
బునప్రాకారమునందునున్నపరిఘంబున్
కీవిచేదాల్చి య
ద్దనుజానీకముజంపి వెండియు
మహోత్సాహంబుదీపింపగా

కం॥ తనవాలాగ్నిప్రభలే
కనుగొనకిరణాళిగాగ కమలాప్తునితే
వనునొప్పి కపివరేణ్యుడు
మనమునతత్సవిత్రు ననలు మఘువుదలచుచున్

కం॥ వాలాగ్నిగాల్చివైచెద
నీలంకానగరమనుచు నింపొదవగ వా
తూలతనూభవుడెగసెన్
వేలిమిరక్కసులయిండ్ల వేల్మిదహింపన్

సీ. భర్గుడీరీతివానరప్రవరుడగుచు
త్రిపురములతొల్లిగాల్చి యార్తినిదపింప
రక్కసులు-లంకగాల్చగారమణవచ్చె
ననుచు భావించి మదినిభయంబునొంద

సీ. అద్రిప్రహస్తుగృహమ్ముభస్మముజేసిఁ
గొరలిమహాపార్శ్వ గృహముగాల్చి
సూర్యశత్రునికొంప శుకసారణులయిండ్లు
భస్మముజేసి యాపైన వజ్ర
దంష్ట్రునిభవనంబు దగమేఘనాదుని
గృహము నకంపనుగృహముగాల్చి
జంబుమాలి సుమాలి సదనంబులదహించి
ఘటకర్ణుగృహమునుగాల్చి పిదప

గీ. బ్రహ్మశత్రు నరాంతక హ్రస్వకర్ణ
రశ్మికేతుల గృహము శోర్పడదహించి
మరియులంఘించి రాక్షసమందిరములు
శౌర్యమేపారదహియించె జాలిమాని

కం. పరగవిభీషణు వేశ్మము
నరయంగావదలి మిగిలినట్టిగృహములన్
కరువలిపట్టిదహించెను
సురలెల్లరుమెచ్చి నింగి స్తోత్రముజేయన్

కం॥ హనుమంతునకుందోడై
ననలుడునసిలుండు సాయమమరంజేయన్
దనుజులభవనములన్నియు
ఘనరవములకాలికూలె కడువడిధరణిన్

గీ. పుణ్యమునశింప దివినుండిభువికినొరగు
పుణ్యవంతులవలె కాలిభూమిగూలు
సౌధచయములు ఫళఫెళ
శబ్దములనువిఱిగిపడె సర్వభూతముల్ వెఱగుపడగ

కం. హానాథా! హాసోద !
హానందనయనుచురాక్షసాంగనలార్తిన్
దీనమతిన్ విలపించుచు
నాననములశోభదఱిగి యార్పులునిగుడన్

గీ. కొప్పులునుమిద్ద భస్మమైకూలునట్టి
భవనములతోడ యాకాశపథమునుండి
భూమిపైబడుచుక్కలపోల్కినొప్పి
భీకరంబుగనఱచుచు భీతిగొలుప

కం॥ కుంకుమ కింశుక శాల్మలి
సంకాశములై కృశానుజ్వాలలెగయుచున్
సంకూదినట్లు రవముల
ఱంకకవహ్నియుదహించె సౌధచయములన్

గీ. స్వర్ణ రజతమయంబులు
వజ్రనీలమణుల నిర్మితమైనట్టిమందిరముల
నదయుడై గాల్చె హనుమంతునాశ్రయించి
యగ్ని-బలవంతుమైత్రిధైర్యమునుగూర్చ

కం. మునురావణునకుజంకిన
ననలనదాగతులుతెచ్చి హనుమంతునిప్రా
పునలంకానగరంబును
దనుజేంద్రుడుభీతినొందగ దహియించిరొగిన్

కం. నానావిధమణిమయము
మానితసుందరము మేరుమందరనిభమౌ
దానవనాథునిభవనము
వానరవరుడెక్కిగాల్చి వసుధంద్రోచెన్

కం. త్రిపురంబులనుదహించిన
కుపితుండగురుద్రుభంగి కుప్పించుచునా
కపివర్యుడలర దైత్యాధిపుడున్
వెఱగందిజూచె ధృతిగోల్పడగా

గీ. ప్రళయకాలాగ్నిహోత్రుడో భాస్కరుండో
శమనుడో రుద్రుడో కపీశ్వరునిరూపు
దాల్చివచ్చెనేమోయని దైత్యులెల్ల
భయమునందగ పరికించిపవనసుతుడు

గీ. శాంతినొంది వాలాగ్నినిజలధిముంచి
ప్రీతిజల్లార్చుకొని వడిన్పేర్మినెగసి
అల్లత్రికూటాద్రిశిఖరమునందునిలచి
యిట్లుయోచించె మదిభీతియెసగనార్తి

కం. నేనీలంకానగరము
హీనమతిన్గాల్చితిపుడ యేర్పడనిచ్చో
జానకియుండుటదలపక
మాననమునకోపగించి మాత్సర్యమువన్

కం. కోపిష్ఠుఁడైనవాఁడిల
పాపాచరణుండు దుఃఖభాగుండగు నా
కోపమునఁజంపుగురులను
కోపముదాల్పంగరాదు కుత్సితవృత్తిన్

గీ. అరయఁదీప్తాగ్నినీటచల్లార్చునట్లు
ధీరుడైకోపమునఁనిరోధించు నెవడు
బుద్ధినతనిమహాత్ముఁడు పుణ్యుఁడనుచు
ధన్యవాదములర్పింపదగు ధరిత్రి

శా. నేపాపిష్ఠుఁడ హీనకర్ముఁడగుటన్
నీచత్వముంబూని హా
కోపావేశమునన్దహించితిపురిన్
ఘోరంబుగా నిండుసీ
తాపద్మాక్షివసించుటనెఱిగియున్
దగ్ధంబుగాకుండు నే
తాపంబందుచు మంటలంగటగటా
ధ్వస్తంబుగాధైర్యమున్

కం॥ అనలంబునదగ్ధంబై
జనకజమరణించునేని సద్గుణఖనిరా
మునితోడనేమిజెప్పుదు
దనుజులబరిమార్చుటెల్ల దబ్బఱకాదే

ఉ. వినుమవీతిహోత్రుడు
శుభాంగి దయామయి సచ్చరిత్రయౌ
జానకిసత్కృపామహిమ
చందనమట్టులచల్లనౌట నా
మేనుదహింపజాలడన
మించుదలన్ సుగుణప్రదీప నా
జానకిగాల్చు టెట్లు పరుషంబున
సందియమేలనిత్తఱిన్

ఆ. వె. సాధ్వి మంగళాంగి సత్యస్వరూపిణి
పుణ్యకీర్తనీయ పూతచరిత
మైనసీతనెట్లు నగ్నిహోత్రుడుగాల్చు
నామె తేజమునకు నతఁడు వెఱచు

కం॥ అనిచింతించెడువేళన్
హనుమంతునివిక్రమమునకలరుచు నింగిన్
జనుచారణులుప్రియంబున
ననుమాటలు వనిలజుండునాకర్ణించెన్

కం. ప్రాకారప్రాసాదము
లాకారముదఱిగి యగ్ని నదెభస్మంబై
జీకాకునొందె సీతను
వాకొనజేరంగనెఱచె వైశ్వానరుడున్

గీ. భస్మమొనరించె లంకనీపావకుండు
సీతకడకేగలేదని చెప్పుకొనెడి
చారణులమాటలాలించి సంతసమున
జానకింజూడపావనిజనిముదమున

౦. నినునాభాగ్యవశంబున
కనుగొంటినితల్లి యగ్నికరుణన్‌జూడన్
జనవిభునిచెంతకేగగ
మనమునకాంక్షింతుననిన మహిజయుప్రీతిన్

౦. బలముననీకుసాటి
గుణభద్రపుఁడెవ్వరులేరు యుక్కునన్
జలధినిదాటియిప్పగిది
శత్రుపురంబునుజేరి దుష్టదై
త్యులబరిమార్చి
సముద్రముతోడనులంకనుగాల్చితీవ మొ
క్కలమునమెచ్చినేను
నినుగాంచినమోదమగున్ మనంబునన్

. జలనిధిదాటి యివ్విధివెసంజను
దెంచుటనీకు సద్గుణా
కలితుడు నీదుతండ్రియగుగాడ్కిఁ
దార్ఢ్యనకొప్పుగాని య
న్యులవశమేకపీంద్ర
పురుషోత్తములాద్యులు రామలక్ష్మణుల్
దలపగవార్ధిదాటి
సముదంబునవిప్పురజేరుటెట్లొకో

. అనిన సమీరనందనుడు
నర్మిలిసీతకుమ్రొక్కి రక్తియి
ట్లను భయమొందనేల మహితాత్ముల
రాఘవులఁబ్రియంబునన్
గొనియరుదెంతునిచ్చటకు
కోతులు ఋక్షములున్ పరాక్రమం
బునగొలువంగ నీమదినిఁబొక్కగనేల
సహింపుమమ్మరో !

గీ. కలరుసుగ్రీవుచెంత లక్షలుసుకోట్లు
నర్బుదములును శంఖసంఖ్యలను మీరు
ప్లవగవర్యులు వారెల్ల భానుసుతుని
గొలిచివత్తురు దనుజులగూల్పవడిని

శా. ఉగ్రుండోయని శాత్రవుల్‌బెదర
దివ్యుల్‌మెచ్చగా నాగ్రహా
దగ్రుండై దశకంఠుసైన్యమును
నుత్యద్దీప్తిజెండాడ శౌ
ర్యోగ్రంపశ్యుడు నావెలుంగుచు
సమర్థుల్‌వానరుల్‌గొల్వగా
సుగ్రీవుండరుదెంచుశీఘ్రమున
నీశోకంబుబోకార్పగా

గీ. రామనామాంకితములు విరాజితములు
సర్వశాత్రవసంహారసంభ్రమములు
నైనరామాస్త్రములు లంకనావరించి
యొసగజూచెదు తడవులేదిదినిజంబు

మ. వినుమోతల్లి భవత్ప్రియుండు నరులన్
వీరత్వమేపారరం
జనదున్మాడి యయోధ్యకేగి
యమితోత్సాహంబునన్ నీవుమ
న్మనసేవింప సుఖాన్వితుండునగు
నానందంబుజేకూర్చు నీ
కనిశంబున్ ప్రియభోగసౌఖ్యముల
దుఃఖావేశముల్వీడుమా

కం॥ అనియూరడించిసీతను
హనుమంతుండామెయాజ్ఞ నసురక్తినిగై
కొని యామీదనరిష్టం
బనుపర్వతమెక్కిదివ్యులభినందింపన్

కం॥ రామునినన్నిధికింజనగా
మదిదలపోసి తనదుకాయముబెంపన్
ధీమహితుడైన నాతన్రిబేమంజారణులు
వొగడ భీమజవమునన్

గీ॥ మత్స్యకచ్ఛపనక్రాహిమందిరమును
నూర్మికలనుగంభీరమై యెప్పుడాని
నతిభయంకరమైనట్టి యర్ణవమును
గాంచి లంఘింపకాంతివిక్రాంతుడనయ

ఆ.వె. ఉదధినుత్తరించి యుత్తరపుందెన
జనదలంచి సిద్ధచయమువొగడ
పైకెగసె నరిష్టపర్వతముంభువి
నొదుగకాళ్ళనూది యురుజవమున

ఉ. పారములేనియూజలధిపై
జలదంబులడాగుచున్ ద్వరన్
వా•దముల్ దెసల్ జెదర
వారిజమిత్రునివోలెకాంతి వి
స్ఫారితుడై ప్రభంజన
సుపర్ణులరీతి మనోజవంబునన్
మారుతిసింహనాదములున్నదిక్తటముల్ వగుల్పగా

ఉ. అంబుధిపైపడింబలుచు
నాతడొనర్చుచున్న సింహనా
దంబులనాలకించి సముద్రంబుననంగద డాదివానరుల్
సంబరమొంది వాలములజాసు గ్రదిప్పుచు
నెంచిరిట్లు మో
దంబునవచ్చువాయుజుడు
ధాత్రిజజూచిన రీతిదోచెడిన్

## హనుమంతుడు జాంబవదాది వానరులతో భాషించుట

ఆ.వె. జాంబవంతుడంత సంతసమునమునుబ్బి
కపులజేరబిలిచి కలతనొంద
నేల గాలికొడుకు నీక్షించెసీతను
గానసేయుసింహగర్జనములు

కం॥ కృతకృత్యుడుగాడేనియు
నితడివ్విధిగర్జనముల నింపొదవంగా
స్తుతమతినలరారునొకో
క్షితిజన్పరికించియుండు శ్రేయములొదవన్

ఆ.వె. చిన్నకొమ్మలూగచిందులుద్రొక్కుచు
కపులుతోకలెత్తి కడుముదమున
చేతులెత్తినిలచి చేమోడ్పులుపుటింప
నమ్మహేంద్రపర్వతాగ్రమందు

ఉ. ప్రాలి-గుహాల్ప్రతిధ్వనులవందురనార్చి
సమీరజుండు క
ల్లోలమునైమహేంద్రగిరి
లోగ్గడిలన్ నిలువంగ వానరుల్
వాలములన్ గదల్చుచు
జవంబున పావనిచెంతకేగి గై
కోలునసంజలింపఁ
గడుకూరిమినంగదజాంబవంతులన్

ఆ.వె. చూచిమ్రొక్కి ప్రేమజొప్పిల
కపులెల్లదనకుమ్రొక్క సమ్మదమువహించి
వారితోడజెప్పె వనలక్ష్మిసీతను
జూచివచ్చితేను శూరులార

కం॥ అంగదునికౌగిటనుజేర్చి యనిలజుండు
నీమహేంద్రాద్రిపమతలమిచటుగలదు
రండుకపులెల్ల వేనుశ్రీరామునతిని
గాంచివచ్చితి తత్కథాక్రమమువినుడు

కం. అనినన్ వానరులెల్లరు
హనుమంతునిమెచ్చియచట నాసీనులునై
జనకజనెచ్చటగంటివి వినిపింపుమువీరవర్య
వేడుకననిన

కం॥ మనమునమోదమునొందుచు
హనుమంతుడుబలికె మీదుయానతిజలధిన్
గొనకొనిదాటుచునుండగ
వినుడొకనగముద్భవడియె విపులజలధిలో

కం, మైనాకమనెడుయాగిరి
జానుగనాకడుపడిన శౌర్యమ్మునసనం
భోనిధివడవక్షంబున
నానగముంద్రోయనదియు నతిమధురముగా

గీ. నీకుసాయమొనర్పగానిలచితేను
గౌరవింపుముమిత్రునిగా మహాత్మ
యనిన నాగిరిన్మన్నించి యవలికేగ
నురసయనునాగమాత నేచోద్యమొంద

గీ. వచ్చిననుదినకాంక్షింప వనజనయను
డైన శ్రీరాముకార్యార్థమరుగుచుంటి
విడువుమని దీనమతిని
నేవేడుకొనిన నాపెయంగీకరింపక నబ్బురమున

గీ॥ తివిరిననుమ్రింగవక్త్రముదెఱవనామె
పెక్కుయోజనములనేను పెరుగునంత
దెఱచెనంతనాస్యము ననుదినగనామె
ప్రీతి నంగుష్ఠమాత్రశరీరమూని

కం. నేనామెవదనకుహరము
లోనికిజనివెడలివచ్చి లోకేశుడు త
ల్లీనీకిచ్చినవరమున
నీనోటంబడితినని నివ్వెరపడుచున్
సెలవొసఁగిన నటమీదన్ జలధిన్
సింహికయుననెడిఛాయాగ్రాహిన్
జలమునప్రాలివధించితి
కలకలభూతములువొగడి గౌరవమీయన్

సీ. ఆప్తినిశీథమునందు
లంకాపురంబున కేగ లంకకుబుద్ధినన్ను
నదలింపగావనితాకృతిదాలిచి
యెదిరింపనోగించి యింపుమీర
సీతనన్వేషింపశీఘ్రమాలంకలో
రాక్షసగృహము లారామములను
చైత్యంబులందు ప్రాసాదంబు లందున
మహిజనుగానక మదిగలంగి

గీ॥ కంపమొందుచు కడకశోకావనంబు
నందుసాధ్వీసుశీలయౌ నవనిసుతన్నుఁ
గాంచిరావణుడాడు వాక్యముల
రామురమణియొసగిన ప్రత్యుత్తరమునువింటి

కం. దనుజేశ్వరుడుం దానవవ
నితలులేనట్టివేళ వరవర్ణిని సీ
తనుగాంచి యామెతోడన్
వినయంబునమాటలాడి వేడ్కనెనయగా

కం. శ్రీరాముడిడినముద్రిక
నారమణికినేనొసంగ పవనిజప్రీతిన్
గౌరవమునదానింగొని
శ్రీరామునిజూచినట్లు సిగ్గుంజెందెన్.

ఉ. రాముని మీఁదిభక్తిని విశాలిని
దద్దయుశోకమొంది యా
భూమిజ రామలక్ష్మణుల
భూరిపరాక్రమ మెంచుచున్ నిజ
స్వామి రఘూద్వహుం దలచి
సంభ్రమమొందుచు గుర్తుగాఁగ చూ
డామణినీయ గైకొని
హుటాహుటి రావణుఁజూచు వేడ్కతోన్

సీ. సుందరమైన యశోకావనంబును
విఱిచి గర్వంబున విక్రమించి
వనపాలకుల జంపి వైవ నిశాచరుల్
భయమున రావణుపాలికిఁజని
నాభుజబలము విన్నాణంబు విన్పింప
మండి రావణుఁడు దుర్మతినసురుల
నెనిమిది వేలు నహీనబలాఢ్యుల
ననుజంపఁబంప ఘనాఘనంబు

వలెగర్జనములుబ్బ వారివధించిన
మంత్రిపుత్రుల వెండి మత్సరమున

గీ॥ బంపినన్ మంత్రిపుత్రులపటిమమీర
బట్టిజంపిన సేనాధిపతులు నన్ను
జంపవచ్చిన వారినిజంపి మరియు
నక్షయకుమారుజంప భయంబునొంది

కం॥ రావణుఁడు నింద్రజిత్తును
ధీవరుదనసగ్రనుతుని ధృతిననుబట్టన్
వావిరిబంపిన నాతఁడు
కావరమున నన్నెదిర్చి కలనయొనర్పన్

ఉ. వానిమహాస్త్రశస్త్రములవాడిమి
నొంచుచు నబ్బురంబుసన్
దానవులన్ వధించుచు
సదాగతివోలెనభంబునందు స్వే
చ్ఛానియతింజరించుచు
నిశాచరసైంతయునొవ్వజేయ నా
పైనరయంబునఁవిడిచె
ఖాసురమౌద్రుహిణాస్త్రమంతటన్

సీ॥ పరగబ్రహ్మాస్త్రమునకట్టుబడిన నన్ను
నసురులెల్లరుగ్రుద్దుచు నసురనాథు
నన్నిధికిగొనిపోయి స శాత్రవుడగు
రావణునివైభవముజూచి రాణమీర

సీ. రామసందేశమును వానరప్రభుండు
నైనసుగ్రీవుసందేశమునురజెప్ప
రావణుడుమండి ననుజంపరాక్షసులకు
నాజ్ఞనొసఁగ విభీషణుడనజెలంగు

కం. దనుజేంద్రుడైన రావణు
ననుజుడునిట్లనియె దనదునగ్రజుతోడన్
వినుమన్నా దూతనుజంపనుబాడియె
రాజనీతిపారీణుడవై

చం. అనినమహాగ్రహంబున
దురాత్ముడురావణుడంతమీద వం
చనమునసైన్యమెల్ల ననిజంపినవానరుడైన వీని తో
కనువడిగాల్చి
యెల్లరునుగాంచపురంబునద్రిప్పిద్రోలుడీ
యనిన నిశాచరుల్ హరుసమందుచు
నవ్విభునాజ్ఞనంతటన్

ఉ. తోకకునిప్పువెట్టి విమతుల్
దనుజాధములుబ్బి గుంపులై
పీకపురంబునందు
సరవింనన్నుద్రిప్పుచునుండ బంధముల్
దేకువనార్చిద్రెంపుకొని
ధీరమతిన్ పరిఘాయుధంబుచే
నాకరవృత్తి రాక్షసులసచ్చటు
ధీమతిజంపి యేర్పడన్

కం. అలంకానగరంబును
పొలిమివాలాగ్నిగాల్చి మరియామీదన్
గాలెడిదోకనువార్ధిని
నాలోజల్లార్చిసీతయనుమతిగొనగా

గీ. తిరిగిజానకిసన్నిధి కరిగిసేమ
మడిగియాచార్చిరాముని కడకుజనగ
ననుమతినొసంగుమనిన నాజనకతనయ
రెండునెలలేనుజీవించి యుండుదాన

కం. జనవిభునిదోడితెమ్మన
వినయంబునమ్రొక్కి మగిడి విక్రమమున నే
వననిధినిదాటివచ్చితి
జనపతికడకేగలెండు సద్గుణమెనయన్

కం. అనినన్ తారానందను
దనుకపులనుజూచి యొక్కహనుమంతుడె లం
కనుగాల్చిఁజంపెదనుజుల
దనుజేంద్రుడుభీతినొందుగ ధైర్యాన్వితుడై

సీ. క్షోణీధరంబుల చూర్ణముగావించు
మనజాంబవంతునిమహితశక్తి
దిక్పాలకులనేని ధృతిదాకినోడించు
నిరుపమానబలుండు నీలుపటిమ
యశ్వినీసుతులైన యసమానవిక్రముల్
మైందద్వివిదుల సమర్థతయును
యక్షగంధర్వదేవాసురవర్గము
నోడింపగల కపులుక్కుమిగుల

గీ. నింకవెనుకాడబనియేమి
యెల్లరమును లంకకుంబోయి దైతేయులనువధించి
రావణునిబట్టి కట్టి ధరాతనూజ
సహితముగ రాముచెంతకుజనుటమేలు

కం హనుమంతునివిక్రమమున్
వినుతింపన్వశమె వేదవేత్తయునగు నా
వనజాసనునకునేనియు
కనుగొనకబళించుముజ్జగంబుల వరుసన్

కం. సురమర్దనుడగురావణు
సురలత్యాశ్చర్యమొంది౛ జూడగకడిమిన్
పరగవధించిప్రియమ్మున
ధరణిజనర్పింతు రామధరణీపతికిన్

కం తేవను ధృతి శౌర్యమ్మున
రావణుడేగాదు దేవరాజే ననుసం
భావింపదాకెనేనియు
చేవంజెడియోడుటన్ వచింపనగుగదా

కం. రావణునజంపి సీతా
దేవినిగొనితేవి రాఘుదేవునికడకున్
బోవుటయేయుక్తంబని
భావంబునదలచితేను పావనబుద్ధిన్

గీ. అనిన సంగదుమాటలకనుమతించి
కపులుగంతులువేయుచు-కపటమతిని
ధరణిజనుదొంగిలించిన దురితకర్ము
బవరమునజంపదగునను నవసరమున

గీ. నిరుపమానపరాక్రమాన్వితుడు ధీరు
డైనజాంబవంతుడు నిట్టులనియె కపుల
వంకగన్గొని మిమ్ముబవరమునందు
గెలువదివ్యులకేని శక్తియునులేదు.

మ॥ మనతో సీతనుజూచిరండనుచు
సమ్మాన్యుండురాముండు జె
ప్పెనుగానీ దనుజేంద్రునిన్దునిమి
సంప్రీతిన్వడిన్ జానకిన్
గొనిరండంచువచింపలేదుగద
యోగ్యుల్ రామసౌమిత్రులే
జని యారావణునిన్వధింపవలయున్
శౌర్యంబుదీపింపగా

కం. జనకజసేమపువార్తను
జననాధునితోడజెప్పజనవలెనని చె
ప్పినజాంబవంతుపలుకులు
వినివానరులెల్లమదిని విస్మయమొదవన్

కం. ధీనిధిరాఘునిజూడం
బూనిమహేంద్రాద్రివిడిచి పొంకముగా నా
వానరులునభ్రపథమున
పూనికజని మధువనంబుపొంతనుడిగ్గన్

ఉ. తేనియలన్ ఫలంబుల
నతిప్రమదంబునుగూర్చ్చ నామహో
ద్యానవనంబుజేరి
కవులందరుడయ్యుటజూచి యింగిత
జ్ఞానియునైనయంగదుడు
సంభ్రమమొందగనేల మీరలీ
తేనియలన్ ఫలంబులనుదీకొని
త్రాగుడు మెక్కుడీ యనన్

## వానరులు మధువనంబును పాడొనరించుట

మ. పరమానందమునన్కపుల్
ఫలములన్భక్షించుచుం దేనియల్
సరవిం గ్రోలుచు కొమ్మలన్
విఱుచుచున్ సంతోషముంజెంది జె
చ్చెరగొబ్బిళ్ళుఘటించుచున్
వివశులై చెర్లాటలన్ నవ్వుచున్
పరిహాసోక్తుల జేతులంజఱచుచున్
భక్తిన్ప్రలాపించుచున్

గీ. ఒకడుగానముసేయ వేఱొకడునవ్వ
నొకడుదుఃఖింప నాడుచునొకడు ప్రీతి
నొక్కడొక్కనిబడద్రోయ నుర్విదుమికి
తొడఱచిమీదికిగురును దొమ్ములాడ

కం॥ కపులెల్లరు మధుమదమున
నపగతవిజ్ఞానులగుచు నామధువనమున్
గుపితమతిబాడొనర్చిన
నవనోదకరుండునగుచు నాసమయమునన్

గీ। తరణిజునిమేనమామయౌదధిముఖుడను
బలియుడదిజూచి యావనపాలకుండు
నగుట రౌద్రాకృతిన్ వచ్చి
యగచరులనుముష్టిహతినొంచి మరిపాదములనుదన్ని

1. అనిలజాంగద జాంబవంతాదికపులు
దధిముఖుని వానిభటులను దర్పమెనయ
గోళ్ళచేరక్కి పీడింపకోయటంచు
వారుసుగ్రీవుచెంతకు వలసనేగి

1. ధీవినుతుల్ గుణోన్నతులు
దివ్యపరాక్రమతేజితార్కులున్
శ్రీవిమలాంతరంగులు సుశీలురు
రాఘవులర్ఘభజించు సు
గ్రీవునిచెంతజేరి వివరించిరి
మ్రొక్కుచు మోసమయ్యెనీ
సేవకులైనమమ్ము పరిశీలనగావుము తప్పులుండినన్

. అనినన్ దధిముఖుడిట్లను
నినజునితో మాదుదేహమెల్లనుడెడియెన్
గొనకొనివనముబాధించిరి
యనగాసుగ్రీవుడనియె నాదధిముఖున్

. కారణమేమి నీతనువుగాయమునై
రుధిరాంబుపూరముల్
ధారలుగాస్రవించు
విదితంబుగజెప్పుము దుర్వినీతులై
వైరమునూని యెవ్వరునవజ్ఞనొనర్చిరి
వారినామముల్
పేరిమిజెప్పెదేని
వదిపిచమడంచెద విక్రమోన్నతిన్

అ.వె. అనినదధిముఖుండు
నర్కాత్మజునకిట్లులనియె వినుము యంగదాదికపులు
మత్సరమునవచ్చి మధువనంబునతేనె
ద్రావిపండ్లుమెక్కిఁ దన్నిరిమము

మ. హనుమంతుండును జాంబవంతుడును
శౌర్యాన్వితుడౌ యంగదుం
డును నీలుండు నలుండు
వెండిఋషభుండున్ వానలానీకమున్
తినుడీపండ్లను గ్రోలుడీమధువు
సందేహంబు లేకుండ ని
వ్వనమెల్లన్మనదేనుమీ
యనినధీవర్యుల్ కపుల్ దుర్మతిన్

కం. వనమునచెట్లనువిఱుచుచు
ఘనరవములపండ్లుదినుచు గర్వోద్ధతిఁగాం
క్షనులేనియలంద్రావిరి
వనమృగములుబాఱ పక్షివర్గముబెదరన్

గీ. మధువుద్రావనివాడును
మత్తుగొననివాడు లేడొక్కడేనియు వానరులను
వారివారింపనేగిన వారలెల్ల
మమ్ముగొట్టిహింసించిరి మహితతేజ

చం. కిలకిలనవ్వుచుం బడుచు
కేకలవేయుచు కొమ్మలూవుచున్
జలజలపూలురాల్చుచు
వెసంబరుగెత్తుచు ముష్టియుద్ధమున్
సలుపుచు క్రిందమీదగుచు
చంక్రమణంబులుసేయుచున్ బలే
ఫలములుమెక్కరండనుచు
పండ్లికిలించుచు నుండిరచ్చటన్

గీ. ఋక్షరజునకు బ్రహ్మమున్నిచ్చినట్టి
వనమునంజొచ్చి భీతిరవ్వంతయేని
లేక నంగదుడిట్లుబలియుడనుచు
మమ్ముమర్ధించి ద్రావునేమధువునిట్లు

కం. అనిజెప్పువేళ నినజుని
కనుగొనిసౌమిత్రి యితడుగాసింబడగా
మనమునగుములుచునివ్విధి
వనటుంబడనేలయనిన వాత్సల్యమతిన్

ఉ. భానుజుడంత రాఘవుల
భవ్యమనస్కులజూచ్చిమ్రొక్కి న
మ్మానితకీర్తిశాలి హనుమంతుడు
సాధ్వి గుణాగ్రగణ్యయౌ
జానకిజూడదానెటిగి
సమ్మతివచ్చినరీతిదోచు య
ట్లేనిశుభంబు మావనమునందలి
తేనెలగ్రోలసాధ్యమా

కం. గడువొకమాసంబొనగితి
పుడమిసుతన్వెదకిరండు పొందని గడిమిం
గడువేనాడోముగిసెను
కడుకొని వనమిట్లుజెలుపగాఁ దలపోయన్

చం. మహీజనుజూచివచ్చిరని
మానసమందుదలంతునేను ధూ
ర్వహులగువానరోత్తములు
వారలుసీతనుగాంచరేని ని
స్పృహగడు దీనవక్త్రులును
సిగ్గిలువారలునై క్షమార్హులై
తహతహలాడుచున్ మదిని
తాపమునొందుచు వచ్చిమ్రొక్కరే

కం॥ సీతనుజూడక యంగదుడే
తీరునవచ్చునిట్లుయేతెంచినచో
భీతినివడకుచునుండక
బ్రాతినిమధువనమునెట్లు పాడొనరించున్

గీ. అంగదుడు జాంబవంతుడునధిపులగుచు
నుందురెయ్యెడ హనుమంతుడురవడించి
కార్యసాధకుడగుచు నక్కార్యమందు
జయముసిద్ధించు కలుగునుత్సాహమెంచ

కం. సీతాసేమంబారసి ప్రీతింజనుదెంచె
శత్రుభీకరుడగు న
వ్వాతాత్మజుడుగణింపగ
ప్రీతాత్ముడవగుమునీవు పెలుచనరామా

కం. అనిదధిముఖునికనుంగొని
ఘనజుండిట్లనియె నీవునేగిప్రియమునన్
హనుమంతుడాదికపులను
ఘనజుడురమ్మనియెననుచు నింపునజెపుమా

ఆ. వె. భానుజుండ నేను ప్రస్రవణాద్రిని
దాశరధులగూడిదమక మెసగ
నుండెననుచుజెప్పి
నోగివారిబంపుమాయనిన దధిముఖుండు నాక్షణంబ

ఆ. వె. అంగదాదికపుల యంతికమునకేగి
యంజలించి మిమ్మయర్కజుండు
దాశరధులగూడి దాప్రస్రవణగిరి
నుండిబిలువనంపె నుత్సుకమున

చం. అనవిని యంగదుండు
కపులందరగన్గొని శూరులార ధీ
వినుతుడు సూర్యనందనుడు
వేగమరమ్మనివార్తనంపె - సీ
తనుపరికించివచ్చిన విధంబు
నెటింగినరీతిదోచు - రం
జననికఖావికార్యము
ప్రసన్నతనెవ్విధిజేయగాదగున్

కం॥ మీానిర్ణయముం జెలుపుడు
భానుజుఁడా దాశరథులపజ్జవసింపం
గానయగారమునంజన
మానితమగుగాదెయనిన మర్కటులెల్లన్

కం. యువరాజాను సుగ్రీవుని
సవిధంబున కేగుటొప్పు సత్వరమనినన్
జవమున నాకాశమునకు
ప్రవిమలమతినుద్గమించి ప్లవగులుదీప్తిన్

కం. హనుమంతునిముందిడుకొని
యనుపమవిక్రములునైన యగచరులంతన్
జనిసుగ్రీవునిచెంతను
వినమితులైమహికిడిగ్గి వేడుకమ్రొక్కన్

కం. అనిలజుఁడు రామచంద్రుని కనుగొని
యానందబాష్పకణములు నిండలన్
వినయమున నంజలించుచు
వినమితగాత్రుండునగుచు వెసనిట్లనియెన్

గీ. చూచితినిసీతనో రామ
శోకవివశయగుచు గమనింప నీవిరహంబువలన
దీప్తిదటిగికృశాంగియై దీనమతిని
రావణుపురంబునందుండ రమణినేను

కం. పరమపతివ్రతామణి
శుభవ్రత ధీరయు నేకవేణియై
ధరశయనించుచున్
విరహతాపమునన్నినునెంచుచున్ విరం
తరమునురామరామయని
ధ్యానముసేయుచు - రావణుండుని
ష్ఠురముగుహీనభాషణల
గ్రుక్కబడన్ వెఱపింప రాఘవా.

## హనుమంతుఁడు రాముునకు సీతవిధమునుఁజెప్పుట

కం. అనిహనుమంతుడుబలికిన
ననిలజు వాక్యములుమదికి నానందముగా
ర్వను రామలక్ష్మణుల్ప్రియ
మునమెచ్చిరివాయుసుతుని ముదితమనస్కన్

ఉ. సీతనుజూచివచ్చితనిచెప్పిన
మారుతివంకజూచి వి
ఖ్యాతుడురాముగిట్లను
దయామయవాయుకుమార ధీమతిన్
సీతను నామనోహరిని
శీలగుణాన్విత నెందుజూచితే
రీతిని నెట్టులుండె వివరింపుము
జెచ్చెర నాలకించెదన్

చం॥ అనినమరుత్సుతుండు
సుగుణాత్ముని రాముని మెచ్చి మ్రొక్కి యి
ట్లనె కరుణాంతరంగ
జలజాక్ష వచించెద సర్వమేను శ్రే
ద్ధను వినుమో మహాత్మ సముదంబున
భానుజునాజ్ఞ సాధ్వియౌ
జనకజ చూడగోరి
వరుసంగపుల్లెల్లరు వెంటునంటుగా

కం. కాననముల శైలంబుల
మానితమగు గుహల వెదకి మఱియామీదన్
పూనిక ముందున కుంజన
గానంబడె జమునిదెసను కడలి మహాత్మా

గీ. దక్షిణసముద్రమును జూచి
దైన్యమొంది కపులు భయపడి మేనులుంగంపమొంది
యొదుగ సంపాతియను విహగోత్తముండు
నమలగుణుడు జటాయువు పుత్రగజుండు

కం॥ తనతమ్ముడగు జటాయువు
నని రావణుచేత వెగుటు నాలించి భయం
బును శోకము క్రోధంబును
మనమున ముప్పిరిగొనంగ - మనికితవడుచున్

ఉ. రావణపాలితంబమరరాజురంబునకీడునైన సు
శ్రీవిలసత్ప్రభానిలయ
సేవ్యము రాక్షసరక్షితంబు శో
భావహమున్ మనోజ్ఞము
శుభాకరమైదగు లంక కేగు నా
త్రోవమజూప వానరులు తొక్కటుముంటడ పార్థిదాటగా

కం॥ శత యోజనవిస్తీర్ణంబతిగంభీరంబునైన
నంబుధి సీయా
నతిదాటబూని తార్క్ష్యునిగతిగగనంబున
కునెగసి కడువడినేగన్

గీ॥ వార్ధి మైనాకమనెడిపర్వతమునన్ను
దాకినంద్రోచి నాగమాతయగుసురస
నన్ను భక్షింపగా వదనముదెఱచిన
దానియుదరంబుజొచ్చి చోద్యమున వెడలి

గీ॥ మరలనింగికి నెగసి సమ్మతినివోవ
సింహికయను ఛాయాగ్రాహి చెంతకునను
పట్టిలాగిన దానినేర్పడవధించి
గగనపథముననేగి మార్గమమునైన

కం. లంకానగరముగాంచివి
శంకటముననేగువేళ సాహసవృత్తిన్
లంకస్త్రీయాకృతినను
జంకింపగ దానిగెలిచి సామర్థ్యమునన్

కం॥ ప్రీతిపురంబునజొచ్చి పునీతను
భూజాత సీత నిరుపమసుగుణా
న్వీతను పుణ్యస్ఫీతను
బ్రాతిగనాలంకయందు పటిమవెదకుచున్

చం. దనుజులసౌధముల్‌దిరిగి
దానవనాథుగృహంబుజూచి రం
జనపురమెల్ల నేవెదకి
జానకినెచ్చటగానలేక వం
తనుగుడిగోపురంబులను
దక్కగలట్టినలంబులందు మ
నన్నమటియొక్కమారు
నదనంబుగదానవులిండ్లజూతితిన్

గీ॥ రావణాధీనమగు యశోకావనమున
రాక్షసస్త్రీలననుమ ప్రతిక్షణంబు
యుగముగానెంచి దుర్ధశబొగులు నీదు
సతినిదర్శించి మోదమున్నతివహింప

కం. రావణుడాసమయంబున
వావిలిసతులెల్ల గొలువవచ్చి మహీజన్
రీవినిగన్గొని సౌఖ్యములీవేయనిబలుక
సీతయెంతయుభీతిన్

కం. కరమునతృణమొకదానిన్
సరగునగొనిబలికెనిట్లు సాధ్వినిసన్నీ
కరణిన్ రట్టుంబెట్టగ
సురమర్దనదగునెనీకు శూరుడవౌరా

కం॥ పతిచెంతలేనివేళన్
సతినబలన్‌దొంగిలించి సాహసమున ని
గ్గతినీయింటికిదెచ్చితి
పతిమెఱిగిన నీదుమేనప్రాణములున్నే

కం. అనిపలువిధముల
నిందించినరావణుడంతమీద సిగ్గునేగక
జనకజకున్వినిపించితి
జనవరనీచెప్పినట్టి సందేశంబున్

కం. వినిపించి యాయశోకావనమున
వృక్షములవిఱువ వనపాలకులె
ల్లినునాపైనేతెంచిన
దనుజాధిపుడడల వారిఁదగదునుమాడన్

సీ. అసురేంద్రుడవ్వార్తనాలించి
ననుజంపవీరులనెనిమిదివేలసంఖ్య
నడుపగా నేజంపినన్
మంత్రిసుతన ప్తకమునుబంపించిన కడగిదునుము
సేనాధిపతులజెచ్చెరబంపినవధింప
నక్షయుడనుపుత్రునంతమీద
బంధింపనురవడిబంపిన దునుమాడ
నామీదరావణుడగ్రసుతుని

గీ. మేఘనాదునిబంపిన మిక్కుటమగు
యస్త్రములనన్నునొప్పించి యాదరమగు
బ్రహ్మశరమ నబంధించి
రాక్షసేంద్రుకడకుగొనిపోవగా భయంకరుడునగుచు

కం. నావిధమున్బ్రశ్నింపగ
పావననినిరామునాజ్ఞ పావనియగునీ
తావనజాక్షిని వెదకగ
నేవచ్చితిననుచు నతనినిందింపంగన్

కం. ననుజంపగదనభటులకు
ననుమతినిడ రావణునకు ననుజుండును ధ
ర్మనిరూఢినెసగు శూరుడు
ఘనుడువిభీషణుడు నంతకరుణాన్వితుడై

కం॥ దూతనుజంపుటదగునే
నీతివిదుల్ నిన్ను పుడమినిందింపరొకో
పాతకముగాన నీవీ
దూతనుజంపింపవలదు దోషియువైనన్

చం. అనినభయంకరాకృతి
నహంకృతినొప్పెడిరావణుండు యి
వ్వనచరుతోకగాల్చి
బలవంతమునన్ మెడబట్టిగెంటుడీ
యనిన నిశాచరుల్ వడినినంబరముల్
గొనివచ్చిజుట్టి నూ
నెనునధికంబుగాదడిపి
నిక్కుచుతోకనుగాల్చి గుంపులై

గీ॥ పురమునందెల్లద్రిప్పి
డప్పులున్మ్రోగ వీడురామునిదూత వేవేగవచ్చి
దనుజులనుజంపి విక్రమోద్ధతిజరింప
వాలముదహించినార మివ్వరునననుచు

కం. పలువిధములననుగొట్టుచు
లలనలునెగతాళిజేయ లంకాపురమం
దలయకద్రిప్పిన పురముంగలయంగా
మరలజూచి కడుభీమముగా

ఉ. కట్టినకట్లుతెంచుకొని
గ్రక్కుననావెనువెంటనవ్వుచుం
దిట్టుచువచ్చురక్కసుల
దిగ్గనజంపి పురంబుగాల్చుచే
నెట్టనమానసంబునగణించి
హుటాహుటి నింటినింటికిన్
కట్టడినిప్పువెట్టి దమకంబున
రెండవయగ్నియోయనన్

చం. వెలుగుననొప్పునన్నుగని
వేదనరాక్షసకాంతలంత కే
కలనుభయంబునన్ భ్రమసి
గంతులువేయుచు చంటిబిడ్డలన్
కలతవడంగనెత్తుకొని
కాలెడియాగృహపంక్తితోడ చు
క్కలవలెక్రిందవాలిపరగన్
మరణించుచు రావణాధమున్

కం॥ విరసోక్తులదూషింపగ
సరగునసౌధములగాల్చి సద్గుణఖని ధీ
వరుడువిభీషణుసదనము
పరికింపగవిడిచి దైత్యపతివగనొందన్

కం॥ ఆపైనావాలంబు
నకూపారమునందుముంచికొడిగట్టిన యా
దీపమునార్పెడిరీతిన్
ప్రాపునజల్లార్చినీదుపత్నికుశలమున్

ఆ.వె. ఎఱుగగోరి మగిడి యింతినన్నిధికేగి
యాపెసేమమరసి యంతమీద
నిన్నుజూడగోరి నీచెంతకీరీతి
వచ్చితేను నిపుడు వనజనయన

కం। నీమగువనీకుగుర్తుగ
ప్రేమగా బంపించినట్టి శ్రేష్ఠంబగుచూ
డామణియిదెగైకొనుమో
రామాయని యనిలజుండు రక్షానర్పింపన్.

ఉ. రాముడు వాయుజుండొసగు
రత్నముగైకొని మోసపోతి నో
భూమిజయంచు దుఃఖమున
భూమిని వ్రాలిన లక్ష్మణుండునా
రాముని లేవదీసి మధురంబగుమాటలనూరడించి యో
స్వామివిచారమేల నురశాత్రవునోంచి
నురల్నుతింపగ

ఆ.వె. భార్యతోడగూడి భక్తినే సేవింప
నొగినయోధ్యకేగి యుత్సవమున
పౌరులెల్లగొలువ పట్టాభిషిక్తుడై
మహానుభం చెదీవు మాసితముగ

గీ. రావణునిపుత్రమంత్రిపురస్సరమున
ప్రీతిగనుమాడి కీర్తినార్జింపగలవు
కలదునీయాజ్ఞనడువలక్ష్మణుడు
సూర్యనందనుడు కపుల్ దనవెంటనడువతీవి

కం. అనినఁ రాఘవుడంగదు
హనుమంతునిజాంబవంతు నర్కతనయునిం
గనుగొనియిట్లనె సీతకు
జనకమహారాజు పెండ్లిసమయంబందున్

కం. ప్రేమనొసంగెను నీనగా
డామణినిదిజూడ నక్కటావివశుడనై
భూమిజబాసినవిరహము
నామదపీడించె వేదనారూపమునన్

కం॥ అనిమదిఁబొగులుచురాముడు
హనుమంతునిజూచియిట్టులనె కపివర్యా
జనకజయభిమతమేమీ
ననుగూరిచియేమిదలచు నర్మిలిజెప్పమా

చం. అనిలతనూజసీతవిధమారసివచ్చితివీవుగాన నా
వనితవిధంబుయేమనిన
వాయుతనూజుఁడురాముతోడ యి
ట్లనునరవిందనేత్ర సుగుణాత్మ
పతివ్రత పావనాంగియా
జనకజ లంకయందుదనుజాంగన
లెంతయునొవ్వజేయగా

కం. రామా! రామా! యనినీ
నామస్మరణంబుజేయు నన్నిలకావన్
రాముడు లక్ష్మణుతోడన్
ధీమణినగు[illegible]

కం॥ దుఃఖించుచు నాతో
వినుమో శ్రీరామ వెనుకనృతాంతము జె
ప్పెను చిత్రకూటపర్వత
మునజానకియంకమందు మొగినిద్రింపన్

గీ॥ ఆసమయమునందు నొకకాకియరుగుదెంచి
యవనిజకుచంబులనుగీటి యంతబోక
మరలమరలబాధింపగ
మండినీవు దర్భనొకదాని బ్రహ్మమంత్రములచేత

మ॥ అభిమంత్రించి రయమ్మునన్
విడువగా నయ్యస్త్రమా వాయసం
బుభయంబందుచుబాఱి వెంటబడి
యంభోధిన్ వెసంజొచ్చినన్
నభమందేగిన నింద్రలోకమునకెన్నన్ జేరబోనీక నా
ఖటిన్జంపగనుద్యమించిన విచారంబూనినీచెంతకున్

కం. అరుదెంచికావుమని నీ చరణంబులవ్రాల దానిజంపక కరుణా
భరణా దక్షిణనయనము
పొరిగొని దయ కాకివిడిచివుచ్చవె రామా

గీ. దురితకర్ముడు నీసతిన్దొంగిలించి
నట్టిరావణుడున్నింప నర్హమగునె
పక్షులందల్పమగు కాకిపైనకినుక
విడిచితీవుబ్రహ్మాస్త్రము విమలతేజ

మ. పురుషశ్రేష్ఠుడు సద్గుణాభరణుడున్
పుణ్యుండు శూరుండు ధీ
వరుడున్ లక్ష్మణుడగ్రజాజ్ఞగొనిఁ
దావధ్యుల్ దురాచారులున్
కరుణాహీనులునైన రక్కసుల
జక్కాడంగరాడేల దు స్తరమౌ భర్తృవియోగ
మేకరణినెంచన్ బాయుదున్ హా విధీ!

కం॥ అనిదుఃఖించుచుజనకజ
నిను లక్ష్మణు నర్కతనయు నీతివిదుండౌ
హనుజాంబవంతు నంగదు
వినయంబుననడిగె గౌరవించుచు రామా!

కం దనుజాంగనలు నిరంతర
మునుబెదరింపంగ దుఃఖమునకురరిపఁ బెన్
మనమునఁబొగులుచు నెంతయు
ఘనతుంబడ నూరడించి వాత్సల్యమతిన్

కం॥ జననీనాపీ పెక్కిన
నినుగొనిచని దేర్చువాడ నీప్రియుచెంతన్
ననునమ్మెదేనిరమ్మన
జనకజయిట్లనియె నీదుశౌర్యమెఱుగుదున్

కం॥ పరపురుషునంటుదగునే
పరికింపగసాధ్వియైనపడతి కపీంద్రా!
పరవశమునమూర్ఛిలనను
దురితాత్ముడు రావణుండుతోకొనివచ్చెన్

ఉ. రామునిదక్కనన్యుని సురప్రభునైననుదాకనేను నా
నీమమయిట్టిదౌట గమనింపుము నాస్థితి
రామలక్ష్మణుల్
ధీమహితుల్ గణింపనరుదెంచి
దురాత్ములమూపుమాపి నా
బాములదీర్పగావలయు
భావిసుఖంబగునట్టులేనియున్

గీ. దాశరథులు సుగ్రీవుడు దక్కగలుగు
కపులుసీతోడగూడి సంగ్రామమందు
నిలువగెలువవశంబౌకో
నిర్జరాదినాథునకునైన నేలవిన్న దననింక

గీ. గాలికిఁ దార్క్ష్యునకు నీకుఁగాక నోరుల
కలవియే శతయోజనాయతమునైన.
వారిధిన్ దాటి లంకకువాసిమీర
వచ్చుటనుదాశరథులింకవచ్చుటెట్లు

మ. అనికన్నీటను మోముదాఁదడపుచున్
హాయంచు దుఃఖించు నం
గననూరార్చుచునిట్టులంటి వినుమో కంజాక్షి నేనేగిన
జ్జనులౌరాఘవులన్ దయాకరుల నాశ్వాసింపగానిన్ను జ
య్యనదోడ్తెచ్చెద నంసభాగమున దివ్యానీకమున్గింపగన్

కం. ఉత్తమవీరునిదూతగ
పుత్తెంతురెయెవ్వరేని పొలతీ ధీరో
దాత్తు బవిక్రమములగు కపి
సత్తములున్నారుయట నసంఖ్యాకంబుగా

కం. ఏపనియందుత్సాహము
జూపుట లేదావిభుండు శోకించుచు దా
నీపైమమతన్పడతీ
వాపోవున్ లక్ష్మణుండు వంతదపింపన్

ఉ. వచ్చునిజంబురాముడు
జవంబునలంకకు వానరోత్తముల్
మచ్చికవెంటనంటగ
సమర్థములైనరఘూద్వహాస్త్రముల్
జెచ్చెరలంకనిండి పరిశీలనభస్మమొనర్ప మౌనులున్
మెచ్చగ రావణాధముని
మేకొనిజంపు శమింపుమమ్మరో

కం. నినునాభాగ్యవశంబున
కనుగొంటినిదుఃఖమొందగాఁ దగునే నీ
కనుపమమగుసౌఖ్యంబులు
వినుమమ్మాగలుగుఁ దొలగువిరహమువగయున్

కం. శంకాలేశము లేదిక
లంకను సమయింత్రు రామలక్ష్మణులరయన్
లంకేశుడు మరణించును
సంకటములు వీడిపోవు సత్యము తల్లీ!

ఉ. వానరపుంగవుండు గుణవంతుడు
శౌర్యరసాన్వితుండు వి
జ్ఞానచరిత్రుడున్ దివిజసన్నుతుడున్ కపిరాజునైన యా
ధీనిధి భానుజుండు గణుతింపగ వానరసేనతోడ లం
కానగరంబు జొచ్చి దమకంబున శత్రుల జంపునమ్మరో

గీ. అంగదుడు జాంబవంతుడు నర్కజుడును
ముప్పురేఖాలు దనుజుల మోహరించి
జంప నీలుడు నలుడును శరభుడనెడు
వీరులున్నారు కపులందు వినుము తల్లి!

ఆ.వె. మఱియనేక కోట్ల మర్కటసైన్యము
రామచంద్రునాజ్ఞ రక్కసులను
నూచముట్టుగాగ నొగివధింతురు మీద
కలదు నీసుతుండు గాడ్పుపట్టి

కం. నేనుంటి రామ నానతి
దానవులం జంపి సముద్రము గూర్పంగా నేనీపుత్రుడనమ్మా
నానేర్పుం బలము దెలిసెనా భయమేలా

చం. అడలకుమమ్మ రాముడు రయంబున
రక్కసులన్ వధించి యే
ర్పడ నిను దానయోధ్యకమరంగొనిపోయి హితాప్తవర్గముల్
గడుకొని భక్తితో గొలువగా నిజరాజ్యమునందు నిల్చి నీ
యిడుమలదీర్చు సౌఖ్యములు నెంతయు తామరతంపరై దగన్

మ. అని వైదేహిని నీమనోహరిని నిట్లాసక్తినోదార్చి రం
జనసీ కాంతననుజ్ఞవచ్చితిని నాచందంబు సర్వంబు ధీ
రనిధి జెప్పితినంచు వాయుజుడు శ్రీరామున్ ప్రశంసింప మె
చ్చెను నమ్మారుతి నిన్ రఘూద్వహుడు వాసిన్
కౌగిలిన్ జేర్చుచున్

గీ. కాంతునివ్విధి సుందరకాండకథను
మునులకుంజెప్పె సూతుడు మోదమెనయ
నంబికానాధ మృత్యుంజయా మహేశ
విశ్వనాధ దయామయ వేదవేద్య

## ఆశ్వాసాంతము

చం. అనుపమవైభవోన్నత మహాత్మక సూర్యశశాంకవహ్నిలో
చన రజతాద్రివాస మునిసన్నుత ధీరగుణాగ్రగణ్య స
జ్జనహృదయప్రమోదకర శంకర పాపభయంకరా యశో
ధన పరమాత్మ శూలధర ధర్మనియామక విశ్వనాయకా

మాలిని :_ నిరుపమగుణతేజా నిత్యసత్యప్రకాశా
పరిగణితవికాసా భక్తహృత్పద్మవాసా
పురహరయభినీతా భుక్తిముక్తిప్రదాతా
దురితనిచయహారీ దుష్టదైత్యప్రహారీ

కం. హర శంభో పరమేశ్వర
పరమానందస్వరూప భర్గ గిరీశా
పరమాత్మ పార్వతీప్రియ
స్మరహర మృత్యుంజయేశ మధిరనివాసా!

గద్య. ఇది శ్రీమద్భరద్వాజసగోత్రుడును పరమేశ్వరశాస్త్రి
పుత్రుడునగు అవధానులపురుషోత్తమశర్మ ప్రణీ
తంబైన పురుషోత్తమరామాయణంబున సుందరకాండము.

మంగళంమహాశ్రీ